DADDY MUMMY AND... I




నేను వారందరినీ
నా ఎక్కో స్కెచ్
పెన్‌తో చిత్రించాను.

**EKCO**
స్కెచ్ పెన్‌తో

రంగులు, పిల్లలు వాటిని ఇష్టపడుతారు, వారు డ్రాయింగు ఇష్టపడుతారు. మీపిల్లలలో సహజమైన ప్రతిభని వెలుపలికి తెండి. అతనికి/ఆమెకి ఆకర్షణీయమైన ఎక్కో స్కెచ్ పెన్‌ల వంటివి బహుకరించండి. అవి ఆకర్షణీయమైన రంగులలో వస్తున్నాయి.

డిస్ట్రిబ్యూటర్లు : కిరన్ & కం.
70/75 [illegible] స్ట్రీట్, బొంబాయి 400 002.
ఫోను : 824482

ఎక్కో స్కెచ్ పెన్‌లతో వ్రాయటం
ఆనందదాయకం.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

"వీరహనుమాన్" రంగుల సీరియల్ ఈ సంచికలో పూర్తి అవుతున్నది. వచ్చే నెల సంచికలో "దేవీభాగవతం" ప్రారంభ మవుతుంది.

ఈ నెల బేతాళకథ ["మంచి సలహా కాదు"]కు ఆధారం మాచిరాజు కామేశ్వరరావు రచన.

## అమరవాణి

నాతంత్రీ వాద్యతే వీణా,
నాచక్రో వర్తతే రథః,
నాపతి స్సుఖ మేధేవ
యా స్యా దపి శతాత్మజా. 1

[తీగలులేని వీణమోగదు. చక్రాలు లేని రథం నడవదు. నూరుగురు కొడుకులున్నా, భర్త లేని స్త్రీ సుఖపడదు.]

సంపుటి 63 సెప్టెంబర్ '78 సంచిక 3

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






**గంగాధర్ జేనా, పిచుకులి ( ఒరిస్సా )**

ప్ర: చంద్రుడికి చందమామ అనే పేరు ఎలా వచ్చింది?

స: దేవదానవులు మందరపర్వతాన్ని కవ్వంగా ఉపయోగించి పాలసముద్రాన్ని అమృతం కోసం చిలికినప్పుడు ఆ సముద్రంలో నుంచి హాలాహలంతో బాటు ఇంకా ఎన్నో పుట్టాయి. అలా పుట్టిన వాటిలో లక్ష్మి ఒకతె, చంద్రుడు ఒకడు. ఆ విధంగా చంద్రుడు లక్ష్మికి తమ్ముడు అయాడు. లక్ష్మి మానవజాతికి తల్లిలాటిది గనక, చంద్రుడు మనందరికీ మేనమామ అయాడు.

**హెచ్. షా, రాణా ( మహారాష్ట్ర )**

ప్ర: హరివిల్లు అనేది ఏమిటి?

స: సూర్యకాంతిలో ఏడు రంగులు మిళితమై ఉన్నాయి. అందుకే కాబోలు సూర్యుడి రథానికి ఏడు గుర్రాలుంటాయని ప్రతీతి; చిత్రకారులు ఆ గుర్రాలను ఏడు రంగులలో చిత్రించటం కూడా మనం చూస్తున్నాం.

ఆకాశంలో వర్షించే మబ్బులుండి, సూర్యకిరణాలు ఆ మబ్బులలోని నీటి తుంపరలకుండా ప్రసరించినప్పుడు వేరు వేరు రంగుల కిరణాలు ఒకదానినుంచి ఒకటి వేరుపడి, సూర్యుడుండే దిక్కుకు ఎదురుగా ఉండే దిక్కులో మబ్బుల మీద పడతాయి. అదే హరివిల్లు అంటాం. ఈ హరివిల్లు ఎప్పుడూ సూర్యుడికి ఎదురు దిక్కుగానే ఉంటుంది. సూర్యకాంతిని "కటకం" కుండా ప్రసరింప జేస్తే హరివిల్లు రంగులు ఇంకా సదరుగా కనిపిస్తాయి.

**అప్పలయ్యభట్ల నాగరాజశర్మ, పీలేరు ( ఆంధ్ర )**

ప్ర: ప్రశ్నోత్తరాలు శీర్షికను ఒక్క తెలుగులో మాత్రమే నిర్వహిస్తున్నారా? లేక ఇంగ్లీషు మొదలైన ఇతర భాషలలో కూడా నిర్వహిస్తారా?

స: ఇంగ్లీషు చందమామలో ఈ శీర్షిక ఇదివరకే ఉన్నది. ఇప్పుడు అన్ని భాషలలోనూ నిర్వహిస్తున్నాము. అన్ని భాషలవారి ప్రశ్నలకూ సమాధానాలుంటాయి.




63

కోతి అన్నమాట విని మొసలికి నిరాశా, అవమానమూ కలిగాయి. అది తనలో, "నేను దాన్ని ఎందుకు తీసుకుపోతున్నానో చెప్పటం బుద్ధి తక్కువ అయింది. తిరిగి ఈ కోతి విశ్వాసం సంపాదించాలి," అనుకుని, పైకి, "మిత్రమా, నిన్ను పరీక్షించటానికి హాస్యమాడాను. లేకపోతే, గుండె ప్రాణి నుంచి వేరుగా ఉంటుందనుకోవటానికి నేనేమన్నా వెర్రికుట్టెనా? నీ గుండెకాయతో నా భార్య కేం పని? తన భర్త ప్రాణమిత్రుణ్ణి ఆవిడ చంపాలని అనుకుంటుంది గనకనా? అందుచేత, మా ఇంటికి పోదాం, వచ్చెయ్యి. నీ కోసం మీ వదినె ఆత్రంగా ఎదురు చూస్తూ ఉంటుంది," అన్నది.

"పోరా, తుచ్ఛుడా! నేను నీ వెంట ఇంక రాకేం? వెనకటికి గంగాదత్తుడు అన్నాడట: 'ఆకలిగొన్నవాడు ఏ పాపానికైనా ఒడిగట్టుతాడు; బలహీనుడికి దయ అనేది ఉండదు; గంగాదత్తుడు బావి వద్దకు తిరిగి రానన్నాడని ప్రియదర్శనుడితో చెప్పు!'' అన్నది కోతి.

"ఏమిటా కథ?" అని మొసలి అడిగితే, కోతి "గుడ్డిపగ" కథ ఈవిధంగా చెప్పింది:

ఒకానొక బావిలో గంగాదత్తుడు అనే కప్పరాజు ఉండేది. దాన్ని బంధువులు అవమానించిన కారణంగా అది చేదతాడు సహాయంతో బావి వెలపలికి వచ్చి, తన బంధువుల మీద పగసాధించేది ఎలాగా అని ఆలోచించింది.

ఇంతలో దానికి ప్రియదర్శనం అనే పాము తన కలుగులోకి దూరుతూ కనిపించింది.



"ఈ పామును బావిలోకి తీసుకుపోయి, నా బంధువర్గాన్ని సమూలంగా నాశనం చేసేస్తాను. శత్రువును వాడి శత్రువు సహాయంతో మట్టుబెట్టాలి. బలవంతుడి పైకి అంతకన్న బలవంతుణ్ణి పంపాలి. ముల్లుతోనే ముల్లును తీయాలి. అందువల్ల మనకు ఏ ఆపదారాదు," అనుకున్నది గంగాదత్తుడు.

ఇలా అనుకుని అది పాము ఉండే కలుగు వద్దకు వెళ్ళి, "ప్రియదర్శనా, నీతో పనికలిగింది. ఒకసారి బయటికిరా," అని పిలిచింది.

ఆ పిలుపు విని పాము, "ఆ పిలిచేది పాము జాతిదికాదు. దానిది పాముల భాషకాదు. నాతో పాములు తప్ప స్నేహం చెయ్యవు. అవతలివాడి జాతీ, గుణమూ, నివాసమూ, బలమూ తెలియకుండా స్నేహం చేయరాదు. ఆ పిలిచేది ఏ పాములు పట్టేవాడో, విషవైద్యుడో కావచ్చు, ఎవరు చూశారు? లేదూ, నన్ను కోసి తన శత్రువు ఆహారంలో కలిపి, ఆ శత్రువును చంపదలచినవాడు కూడా కావచ్చు" అనుకుని, "నువ్వెవరు?" అని అడిగింది.

"నేను కప్పలరాజును. నా పేరు గంగాదత్తుడు. నీస్నేహం కోరి వచ్చాను," అన్నది కప్ప.

"ఇది నమ్మేమాటేనా? ఎండు గడ్డికీ, నిప్పుకూ స్నేహం ఏమిటి? తనను నమ్మకంగా చంపేవాడి వద్దకు కలలోకూడా ఎవరూ వెళ్లరు. కనక నీ వ్యర్థప్రలాపాలు చాలించు," అన్నది పాము.

"నువు అన్నది నిజమే. నువు మాకు సహజవైరివే, కాని నా శత్రువులచేత ఓడి, అవమానం పొంది నీ వద్దకు వచ్చాను. ప్రాణహానీ, ధనహానీ సంప్రాప్తమైనప్పుడు ధనప్రాణాలను కాపాడుకొనటానికి గాను శత్రువును సైతం ఆశ్రయించాలని పెద్దలు చెబుతారు," అన్నది కప్ప.

"నీ శత్రువు లెవరు?" అని పాము అడిగింది. "నా బంధువులే," అన్నది కప్ప.



"వాళ్లు ఎక్కడ ఉంటారు? బావి లోనా, చెరువులోనా, సరస్సులోనా?" అని పాము అడిగింది.

"దిగుడు బావిలో ఉంటారు," అన్నది కప్ప.

"నాకు కాళ్ళులేవు. పొట్టమీద పాకుతాను. అందుచేత బావిలోకి దిగలేను. ఒకవేళ దిగినా, నీ బంధువులను చంపటానికి గాను నాకు ఉండదగిన చోటు లేదు. అందుచేత, నువు వచ్చినదారే వెళ్ళిపో. హితమైనదే తినాలి, జీర్ణమయేదే తినాలి, క్షేమకరమైనదే తినాలి అని పెద్దలు చెబుతారు," అన్నది పాము.

"దానికేమీ విచారించే పనిలేదు. నా వెంట వచ్చెయ్యి. బావిలోకి సులువుగా ప్రవేశించే దారి చూపుతాను. అందులోనే ఉండి నువు నా బంధువర్గం అంతటినీ చంపవచ్చు," అన్నది కప్పరాజు.

ఈ మాట విని పాము, "నాకు వయసు మళ్లింది. ఎప్పుడైనా ఒక ఎలుకను పట్టుకోగలుగుతున్నాను. ఈ కులద్రోహి నాకు రోజులు సుఖంగా గడిచిపోయే మార్గం చెబుతున్నది. దీని వెంటవెళ్ళి కప్పలను తినేస్తాను. శక్తులుడిగి, అవసానదశకు చేరుకున్న వాడు సుఖమైన జరుగుబాటుకు మార్గం చూసుకోవాలని పెద్దలు చెబుతారు," అనుకుని, కప్పతో, "అలా అయితే, గంగాదత్తా, నువు దారి తియ్యి, నేను నీ వెంట వస్తాను," అన్నది.

"ప్రియదర్శనా, బావిలో ప్రవేశించటానికి సులువైన మార్గమేగాక, అక్కడ నువు ఉండటానికి తగినచోటు కూడా చూపుతాను. అయితే, నువు నాకుటుంబం జోలికీ, నా సేవకుల జోలికీ రాకూడదు; నేను చూపే కప్పలను మాత్రమే తినాలి," అన్నది కప్పలరాజు.

"ఇప్పుడు నువు నాకు మిత్రుడవు గనక, నువు తినమన్న వాళ్లనే తింటాను," అంటూ పాము తన కలుగులోనుంచి బయటికి వచ్చి, కప్పను కౌగలించుకుని, దాని వెంట బయలుదేరింది.

కప్ప పామును చేదతాడు వెంబడి బావిలోకి దించి, అది ఉండటానికి నీటి మట్టంలో ఒక తొర్రను చూపింది. తరవాత ఆ కప్ప తన బంధువులను చూపటమూ, పాము వాటిని తినటమూ జరుగుతూ వచ్చింది.

కప్పరాజు బంధువర్గమంతా అయిపోయినాక పాము, "గంగాదత్తా, నీ బంధువుల నందరినీ చంపి తినేశాను. నాకు వేరే ఆహారం చూపు," అన్నది.

"మిత్రమా, నా శత్రువులనందరినీ చంపేసి, నా పని పూర్తి చేశావు గనక తాటి మీదుగా ఎక్కి, ఇక్కడి నుంచి వెళ్ళిపో," అన్నది కప్ప.

"గంగాదత్తా, నీ మాటలు సబబుగా లేవు. నన్ను నా పాత కలుగులోకి ఎలా తిరిగిపొమ్మన్నావు. అందులో మరో పాము ఎప్పుడో చేరి ఉండాలి. కనక నేను ఇక్కడే ఉంటాను. నీ వాళ్లనైనా సరే నాకు రోజు కొక కప్పను ఇయ్యి. లేదంటావా, అందరినీ మింగేస్తాను," అన్నది పాము.

ఈ మాట విని కప్ప విచారంతో, "ఈ పామును ఇక్కడికి తీసుకురావటం ఎంత బుద్ధి తక్కువ! అది అడిగినట్టు చెయ్యక పోయానో మమ్మల్నందరినీ మింగేసి, వంశనాశనం చేస్తుంది. ప్రబల శత్రువుతో మైత్రి ప్రాణాపాయం కలిగించే విషంతో సమానమని ఊరికే అన్నారా? కనక నా వాళ్ళనే రోజుకు ఒకర్ని దానికి ఇస్తాను. బలవంతుడికి చిటికెడు పిండి ఇచ్చి తృప్తిపరచని దుర్బలుడు మొత్తం పిండిని కోల్పోతాడు. మొత్తానికే ప్రమాదం ఎదురైనప్పుడు వివేకి అయినవాడు సగాన్ని త్యాగం చేస్తాడు; అంతా పోగొట్టుకునేకన్న సగమైనా దక్కుతుంది," అనుకుని కప్ప రోజుకొకర్ని తన వారిని పాము తినటానికి చూపుతూ వచ్చింది. పాము గంగాదత్తుడు చూపిన కప్పనేగాక, అది చూడకుండా మరికొన్ని కప్పలను కూడా తినేది. మురికి బట్టలు కట్టుకున్నవాడు ఎక్కడైనా చతికిల పడినట్టే, ఒకసారి నీతికి స్వస్తి చెప్పిన వాడు ఏ అవినీతికైనా పాల్పడగలడు.





# భల్లూక మాంత్రికుడు

## 3

[ అరణ్యగ్రామాల్లోని ప్రజలకు బందిపోట్ల బాధ లేకుండా చేసిన కాళీవర్మను, పొరుగు రాజుకు భయపడి, జితకేతరాజు మరణశిక్ష విధించాడు. శిరశ్ఛేద సమయంలో, ఎనుబోతుపై వచ్చిన తలారి నుంచి గండ్రగొడ్డలిని లాక్కుని కాళీవర్మ, ఆశ్వికనాయకుడి తల నరికాడు. ఆ మరుక్షణం జై, ఆదిభల్లూకా! అన్న పెద్ద కేక వినిపించింది. తరవాత—]

ఆదిభల్లూకా, అన్న కేక వింటూనే ఆశ్వికులందరూ తలలుతిప్పి, ఆ ధ్వని వచ్చిన వైపుకు చూశారు. కాళీవర్మ గుర్రం మీది నుంచి కిందికి దూకి, తాను లోగడ ఆశ్వికుల నాయకుడికి యిచ్చిన కత్తిని తీసుకుని, ఒరలో పెట్టుకున్నాడు. అంతలో కొండచరియ పైనుంచి దుముకుతున్న జలపాతం దగ్గిర, ఒక అజానుబాహుడైన వ్యక్తి కనిపించాడు.

"ఇతడెవరో మాంత్రికుడై వుండాలి!" అనుకుంటూ కాళీవర్మ, తానక్కడి నుంచి పారిపోయేందుకు ప్రయత్నిస్తే, ఆశ్వికులు దారినడ్డగించగలరేమో అని, వాళ్ళ ముఖాలకేసి పరీక్షగా చూశాడు. ఆశ్వికుల్లో ఎవరిదృష్టీ అతడిమీద లేదు. అందరూ జలపాతం వెనకనుంచి, హఠాత్తుగా బయిటికి వచ్చిన వ్యక్తి కేసి భయాశ్చర్యాలతో చూస్తున్నారు.



ఇప్పుడు జలపాతం దాపులనుంచి కేక పెట్టినవాడు, దాని ముందున్న మోకాటి లోతు నీటిపాయను దాటి, ఒడ్డుమీదికి వచ్చాడు. మనిషి మంచి బలశాలిలా వున్నాడు; నల్లని ఎలుగుబంటి చర్మాలు ధరించి వున్నాడు; చేతిలో దృఢమైన దండం వున్నది; దాని పిడిమీద ఒకే వజ్రంలో మలిచిన ఎలుగుబంటి తల ధగధగ మెరుస్తున్నది.

ఆ క్షణం వరకూ, ఆ ప్రదేశాన్నుంచి పారిపోవాలని ఆత్రపడుతున్న కాళీవర్మ, తమకేసి వస్తున్న ఆ వింత దుస్తులు ధరించినవాణ్ణి చూస్తూ కదలామెదలక వుండిపోయాడు. అశ్వికులూ, ఎనుబోతు మీద వున్న తలారీ భయకంపితులై చిన్నగా వణుకుతున్నారు.

ఎలుగ్గొడ్డు చర్మాలు ధరించినవాడు, వాళ్ళను సమీపించి, "నేను సమయానికి ఆదిభల్లూకుడి పేరు స్మరించకపోతే, యిక్కడ మరికొంత రక్తపాతం జరిగి వుండేదని, నాకు తెలుసు. నా పేరు భల్లూకమాంత్రికుడు!" అన్నాడు.

ఒకటి రెండు క్షణాలు ఎవరూ మాట్లాడ లేదు. కాళీవర్మ కుడిచేత్తో కత్తినీ, ఎడమ చేత్తో తలారి నుంచి లాక్కున్న గండ్ర గొడ్డలినీ పైకెత్తి పట్టుకుని, భల్లూక మాంత్రికుడితో, "అయ్యా, అడక్కుండానే తమ పేరేమిటో సెలవిచ్చారు, బావుంది! ఇక యిక్కడ, మీరన్నట్టు కొద్దిలో తప్పిన మరికొంత రక్తపాతం మాట! ఇప్పుడు నా దారిని ఎవరైనా అడ్డగిస్తే, మరికొన్ని కంఠాలు తెగి నేలపడనున్నవి," అంటూ గుర్రాన్ని అదిలించాడు.

"ధైర్యశాలివిరా, యువకా! ఒక్క క్షణం ఆగు!" అని భల్లూకమాంత్రికుడు తన మంత్రదండంతో, ఎనుబోతు మీద కదలా మెదలక వున్న తలారిని చిన్నగా పొడిచి, "ఒరే, ముసుగులో వున్న నువ్వు, ఈ దిరిసెనవన పిశాచానివా లేక రాజుగారి ప్రధాన తలారివా?" అని అడిగాడు.

"అయ్యా, నేను పిశాచాన్ని కాదు; ముమ్మాటికీ రాజుగారి ప్రధాన తలారినే. ఆయన శిక్ష వేసినవాళ్ళ తలలు నరకటం నా పని," అన్నాడు తలారి, మాంత్రికుడి వేషం చూసి భయపడి పారిపోజూస్తున్న ఎనుబోతు మెడను చేతితో దువ్వుతూ.

"అలా అయితే, శిరశ్ఛేదశిక్ష తప్పించుకోవటమే గాక, ఒక రాజసేవకుడి తల కూడా నరికి పారిపోజూస్తున్న నిందితుణ్ణి నువ్వేం చేయబోతున్నావు?" అన్నాడు భల్లూకమాంత్రికుడు, ఆశ్వికుల నాయకుడి కళేబరం కేసి చూస్తూ.

"అయ్యా, నేను నిరాయుధుణ్ణి! నా గండ్రగొడ్డలిని నిందితుడైన యీ కాళీవర్మ బలప్రయోగంతో లాక్కున్నాడు," అన్నాడు తలారి బొంగురు పోయిన గొంతుతో.

ఈ మాంత్రికుడెవడోగాని తన మీదికి తలారినీ, ఆశ్వికుల్నీ ఉసికొల్పుతున్నాడని గ్రహించిన కాళీవర్మ, గండ్రగొడ్డలిని తలారి కేసి చాస్తూ, "ఒరే, ముసుగు పిశాచీ, యిదిగో నీ గొడ్డలి! నా దారిని అడ్డగించగలవేమో చూడు!" అన్నాడు.

ఆ వెంటనే తలారి తన ముసుగు తీసి దూరంగా విసిరివేస్తూ, తడబడే మాటల్తో, "కాళీవర్మా, నువు మహాశూరుడివి; దిరిసెనవన భైరవుడి సాక్షిగా చెబుతు



న్నాను. నా అహం కూడా దిగిపోయింది." అన్నాడు.

"అహంతోపాటు తాగిన మైకం కూడా దిగిపోయి వుండాలి, ఇక దారి తొలుగు!" అని, కాళీవర్మ, కొంచెం దూరంగా వున్న ఆశ్వికులతో, "మీ మాటేమిటి? మీ నాయకుడికి పట్టిన దుర్గతి చూశారు గదా?" అన్నాడు.

"శిరశ్ఛేద శిక్ష అమలు చేయవలసిన వాళ్ళలో ఒకరు చావగా, రెండవవాడు లొంగిపోయాడు. ఈ సంగతేదో రాజుగారికి చెబుతాం. దార్లు అడ్డగించి కుత్తుకలు నరికించుకునేంత అమాయకులం కాదు, మేము!" అన్నారు ఆశ్వికులు.



"బుద్ధిగల మాట చెప్పారు!" అని కాళీవర్మ గుర్రాన్ని అదిలించి, అక్కడి నుంచి బయలుదేరబోయేంతలో, భల్లూక మాంత్రికుడు, "భల్లూకపాదగురో! ఎట్టకేలకు మనకు కావలసిన జాతకుడు దొరికాడు," అంటూ ఒక్క కేకపెట్టి, కాళీవర్మ గుర్రపు కళ్ళెపు తాళ్లు పట్టుకుని, "కాళీవర్మా! ఇక్కడ మహామంత్రవేత్త అయిన భల్లూకమాంత్రికుడు వున్న సంగతే నువ్వు మరిచినట్టున్నదే!" అన్నాడు.

కాళీవర్మకు చిన్నప్పటినుంచీ మాంత్రికులన్నా, భూతవైద్యులన్నా, గణాచార్లన్నా ఏ మాత్రం గౌరవభావం లేదు. అలాటివారిని ఎంతమందినో లోగడ అతడు తను పుట్టి పెరిగిన గ్రామంలో, చుట్టుపక్కల వున్న గ్రామాల్లో చూసి వున్నాడు.

భల్లూక మాంత్రికుడి మాటలు వింటూనే కాళీవర్మ, అతడేదో తనను చులకన చేసి మాట్లాడుతున్నాడని కోపం తెచ్చుకుని, "అయ్యా, తమ పేరు భల్లూకమాంత్రికుడా? వింటేనే భీతి కొల్పేట్టుగా వుంది. మీరు యింతకు ముందే మరొక భల్లూకుడి పేరు కూడా పలికారు; ఆయనెవరు? ఏ భల్లూకుడెవరో గుర్తుపెట్టుకోవటం, నా బోటి సామాన్యుడికి చాలా కష్టం," అన్నాడు.

కాళీవర్మ తన పేరును యింత అపహాస్యం చేసి మాట్లాడినా భల్లూక మాంత్రికుడు కోపం తెచ్చుకోకపోగా, చిరునవ్వు నవ్వుతూ, "నా గురువుగారి పేరు భల్లూకపాదుడు, నా పేరు భల్లూక మాంత్రికుడు. ముందు ముందు జరుగనున్న మహాద్భుతాలు చూసి, మహదానందపడబోయే నువ్వు, పేర్లలో వున్న యీ చిన్న పోలికను చూసి గజిబిజి పడిపోకు," అన్నాడు.

"ఇల్లొదిలి బయల్దేరిం. తరవాత, యిప్పటివరకూ ఎదురైన గజిబిజిల్తోనే మొహం మొత్తింది. ఇక త్వరగా

మా గ్రామం చేరి, పొలం సేద్యం చేసు కుంటూ, ఉన్న దానితో తృప్తిపడ తాను,'' అంటూ కాళీవర్మ గండ్రగొడ్డలిని, తలారి కేసి విసిరివేసి, గుర్రాన్ని గట్టిగా అదిలించాడు.

గుర్రం కదిలి, పదీ పన్నెండడుగులు నడిచి, యిక దౌడు తీయబోయేంతలో వెనకనుంచి భల్లూకమాంత్రికుడు పెద్ద గొంతుతో, ''కాళీవర్మా, ఆగు! నీకెదురుగా వస్తున్న వాళ్లెవరో చూశావా? '' అన్నాడు.

ఆ హెచ్చరిక వింటూనే కాళీవర్మ కొంచెం తల ఎత్తి ముందుకు చూశాడు. ఒక పెద్ద దిరిసెన చెట్టు వెనకనుంచి, ముగ్గురు అశ్వికులు వేగంగా వస్తున్నారు. వారిలో మధ్య వున్నవాడు పట్టుదుస్తులూ, పెద్ద తలపాగా ధరించి వున్నాడు. పక్కల నున్నవాళ్ళు కవచధారులు; వాళ్ళ చేతుల్లో కత్తులూ, భుజాల మీద తళతళ మెరుస్తున్న డాళ్ళూ వున్నవి.

వాళ్ళను చూస్తూనే కాళీవర్మ, గుర్రం కళ్ళాన్ని గట్టిగా వెనక్కు గుంజి ఆపాడు. కవచధారులైన అశ్వికుల మధ్య పట్టు దుస్తుల్లోవున్నవాడు, చేయెత్తి కాళీవర్మను చూపుతూ తలారితో, ''ఒరే, నగరప్రధాన తలారీ! ఈ నిందితుడికి శిరశ్ఛేద శిక్ష విధించారు రాజుగారు. ఇంకా శిక్ష అమలుచేయలేదేం?'' అన్నాడు కోపంగా.



తలారి గడగడ వణికిపోతూ, ఎనుబోతు మీదినుంచి దిగి, ఏం జవాబివ్వాలా అని ఆలోచిస్తున్నంతలో భల్లూకమాంత్రికుడు, తలారిని ప్రశ్నించిన అతడిని సమీపించి, ''నువ్వేగదా, జితకేతురాజుకు ప్రధానామాత్యుడైన జీవగుప్తుడు?'' అని ప్రశ్నించాడు.

రాజు పట్లగాని, తన పట్లగాని ఒక్క గౌరవవాచకం కూడా లేకుండా, అలా ప్రశ్నించిన వీడెవడో కపటబైరాగి అయి వుంటాడనుకుని మంత్రి జీవగుప్తుడు కోపంతో కళ్ళెర్రచేసి, ''ఎవడీ బైరాగి? ముందితణ్ణి ఇక్కడి నుంచి తన్ని తగ లెయ్యండి,'' అన్నాడు.



ఆ ఆజ్ఞ వింటూనే మంత్రి పక్కన వున్న ఆశ్వికులు కత్తులు దూయబోయిన వాళ్ళల్లా, భల్లూకమాంత్రికుడి మంత్ర దండం కేసి చూసి, నివ్వెరపోయారు. గుర్రాలు పెద్దగా సకిలిస్తూ, వెనక్కు నాలుగడుగలు వేసినై.

ఏం జరిగిందో అర్థంకాని మంత్రి జీవగుప్తుడు, ఆశ్చర్యంగా తన అంగరక్షకులిద్దరికేసీ చూసి, "ఏం జరిగింది? పులిని చూసిన లేళ్ళలా అలా వణికిపోతున్నారేం?" అని అడిగాడు.

"అయ్యా, పులికాదు, ఆ బైరాగి చేతిలోని మంత్రదండం పిడికి బిగించి వున్న ఎలుగుబంటి తల కేసి చూడండి! అది ఇంతకుముందు నోరు తెరిచి, కోరలు చాచి, కళ్ళల్లో నిప్పురవ్వలు రేపింది," అన్నారు ఆశ్వికులు.

జీవగుప్తుడు, భల్లూకమాంత్రికుడి మంత్రదండపు ఎలుగు తలాటం కేసి పరీక్షగా చూసి, హేళనగా నవ్వి, "ఏమోయ్, బైరాగీ! నీ మాట తీరూ, చేష్టలూ చూస్తూంటే, పెద్ద పొగరుబోతులావున్నావు. ఏమైనా టక్కుటమార విద్యలూ, ఇంద్రజాలం నేర్చినవాడివా?" అని అడిగాడు.

మంత్రి యిలా అనగానే భల్లూకమాంత్రికుడు గుడ్లురుముతూ అతడి ముఖం కేసి తీక్షణంగా చూసి, "సన్యాసి ముదిరితే, బైరాగి అవుతాడని సామెత; తొండముదిరి ఊసరవెల్లి అయినట్టు! నేను సన్యాసినీ కాను, బైరాగినీ కానే— భల్లూకమాంత్రికుణ్ణి! జై, ఆది భల్లూకా!" అంటూ ఒక కేకపెట్టి, మంత్రదండంతో పక్కనవున్న ఒక ఎండిన చెట్టుబోదెను గట్టిగాకొట్టాడు.

మంత్రదండం దెబ్బకు చెట్టు బోదె నుంచి ఛఠీమంటూ నిప్పు రవ్వలు లేచి, మరుక్షణం చెట్టు భగభగమనే మంటలతో నిలువునా కాలిపోసాగింది. మంత్రి జీవగుప్తుడెక్కవున్న గుర్రం వెనక కాళ్ళమీద లేచి, పెద్దగా సకిలిస్తూ దూరంగా పరి

గెత్తింది. అతడి అంగరక్షకులైన అశ్వికులు, అతణ్ణి అనుసరించారు.

ఒకటి రెండు క్షణాలపాటు అక్కడ వున్న ఎవరి నోటా మాట పెగలలేదు. దూరం నుంచి యిదంతా గమనిస్తున్న కాళీవర్మ, గుర్రాన్ని అదిలించి భల్లూక మాంత్రికుడి దగ్గిరకు వచ్చి, గుర్రం దిగి, "ఆహా, నువ్వు మామూలు మాయలమారి ఇంద్రజాలికుడివి కాదు; మహామంత్రవేత్తవు! కపటీ, దుష్టుడూ అయిన యీ జితకేతరాజు మంత్రిని హడలెత్తించినట్టే, ఇతడి ప్రభువునూ, నీ మంత్రశక్తితో భయకంపితుణ్ణి చేసి, కాస్త బుద్ధిగా రాజ్యపాలన చేసేట్టు ఎందుకు చేయకూడదు?" అన్నాడు.

"భళీ, నువు ధైర్యశాలివే కాదు; బుద్ధిశాలివి కూడారా, యువకా! నా మనసులో వున్నదానిని, యిట్టే పసికట్టేశావు!" అని భల్లూకమాంత్రికుడు, కాళీవర్మను మెచ్చుకుని, మంత్రి జీవగుప్తుడితో, "మంత్రీ, నా శక్తి ఎలాంటిదో చూశావు గదా! ఇక యిప్పుడిక్కడ ఆజ్ఞలివ్వవలసిన వాళ్ళు, నువ్వా? నేనా?" అని అడిగాడు.

మంత్రి జీవగుప్తుడు నిలువునా కాలిపోతున్న చెట్టుకేసే చూస్తున్నాడు. అతడికి తానేదో ప్రాణాపదలో చిక్కుకున్నట్టు



భయంపట్టుకున్నది. భల్లూకమాంత్రికుడు మరోసారి గద్దించుతూ అదే ప్రశ్న అడిగేసరికి, అతడు వణుకుతున్న గొంతుతో, "అయ్యా, భల్లూకమాంత్రికా! మీ అమోఘమైన శక్తుల్ని కళ్ళారా చూశాను. ఇక్కడే కాదు, తమకు తీరుబాటుంటే, రాజప్రాసాదానికి వచ్చి, అక్కడా జితకేతు రాజుగారికి ఆజ్ఞలూ, సలహాలూ యివ్వవచ్చు!" అన్నాడు.

"ఎంతటి మహామంత్రికి, ఎలాంటి దుర్గతి పట్టింది!" అంటూ కాళీవర్మ చుట్టూ వున్న అశ్వికుల కేసీ, ఎనుబోతు దగ్గిర దిగాలుపడి వున్న తలారికేసీ చూశాడు.

భల్లూకమాంత్రికుడు, తన మంత్ర దండాన్ని పైకెత్తి పట్టుకుని, "నా ఆజ్ఞలేమిటో అందరూ జాగ్రత్తగా వినండి!" అని తలారితో, "ఓరీ, తలలు నరకటం చేతనైన నీకు, తెగిన తలలు తిరిగి శరీరానికి అంటించి కుట్టటం కూడా చేతనై వుండాలి, అవునా? వెంటనే అశ్వికనాయకుడి తలను మొండానికి కుట్టి, గుర్రం మీద కూర్చొబెట్టి, పడకుండా తాళ్ళతో బిగించు," అన్నాడు.

తలారి క్షణాల మీద ఆ పని ముగించి, అశ్వికనాయకుణ్ణి ఒక గుర్రం మీద పెట్టి, తాళ్ళతో బిగించాడు. కాని, హడావిడిలో వాడు ముఖాన్ని వీపు వైపుకు పెట్టి కుట్టటంతో, గుర్రం మీద పెడతల కళేబరం స్వారీ చేస్తున్నట్టయింది.

ఈ జరిగిన పొరబాటు చూసి భల్లూకమాంత్రికుడితోబాటు, ఒక్క మంత్రి జీవగుప్తుడు తప్ప, అందరూ బిగ్గరగా నవ్వారు. మాంత్రికుడు, జీవగుప్తుడి కేసి కళ్లెర్రచేసి, "ఓయీ, మంత్రీ, నువ్విప్పుడు తలారి వాహనమైన ఎనుబోతునూ, నీ వాహనాన్ని తలారీ అధిరోహించబోతున్నారు," అన్నాడు.

జీవగుప్తుడు మారు మాట్టాడకుండా వడవడ వణుకుతూ వచ్చి, ఎనుబోతు మీద ఎక్కి కూర్చున్నాడు. అలాగే తలారి పోయి మంత్రి గుర్రం ఎక్కి, కళ్ళెపు తాళ్ళు పట్టుకున్నాడు. అందర్నీ నగరం కేసి బయలుదేరమన్నాడు, భల్లూకమాంత్రికుడు.

జితకేతరాజు మంత్రికి జరిగిన అవమానం చూసి, ఆనందపడుతూ కాళీవర్మ, "ఈ ఊరేగింపు చూసి నగరప్రజలు తప్పక వినోదిస్తారు! ఇక నా దారిన నేను పోయి, మా గ్రామం చేరతాను," అంటూ గుర్రాన్ని అదిలించేంతలో భల్లూకమాంత్రికుడు మంత్రదండం పైకెత్తి, "కాళీవర్మా, నా ఆజ్ఞ వినలేదా?" అన్నాడు.

"ఆజ్ఞా! ఎవరు నన్నిక్కడ ఆజ్ఞాపించగలవాడు?" అంటూ కాళీవర్మ ఒరనుంచి కత్తి దూశాడు. —(ఇంకావుంది)





# మంచి సలహా కాదు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు సమర్థులైన మంత్రుల సలహా పొందిన మీదటనే ఈ శ్రమకు, ఒడిగట్టా వను కుంటాను. కాని ఎంత సమర్థుడైన మంత్రి అయినప్పటికీ ఒక్కొక్కసారి తప్పుడు సలహా ఇయ్యావచ్చు. ఆ సలహా నిరుప యోగం కావచ్చు. అందుకు నిదర్శనంగా నీకు మణికేత మహారాజు వృత్తాంతం చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

మణిపురాన్ని ఏలిన మణికేత మహా రాజుకు లేకలేక మణిమంజరి అనే కూతురు పుట్టింది. ఆమెను తల్లిదండ్రులు మితి మీరిన గారాబంతో పెంకెగా

## బేతాళ కథలు



తయారు చేశారు. చిన్నతనం నుంచీ కూడా ఆమెకు ఎలాటి ఆత్మనిగ్రహమూ అలవడలేదు. ప్రతిదానికీ తారస్థాయిలో మండిపడి, చేతిలో ఏది ఉంటే అది ఇతరుల మీద విసిరి వెయ్యటమూ, నోటికి ఏదివస్తే అది అనెయ్యటమూ చేసేది. ఆమెకు ఏ క్షణాన ఎవరిమీద కోపం వస్తుందో నని రాజూ, రాణీ సైతం భయపడుతూ, ప్రాణాలు అరచేత పట్టుకున్న వాళ్ళలాగా బాధపడేవాళ్ళు.

మణిమంజరి యుక్తవయస్కురాలు అయేసరికి ఆమె వివాహం మణికేత మహారాజుకు రెండందాల సమస్య అయి కూర్చున్నది. అంత కోపిష్ఠిదాన్ని, ఎంత అందగత్తె అయినా, చేసుకోవటానికి ఎవరూ ముందుకు రారన్నది ఒక సమస్య. తన అనంతరం ఆమె రాజ్యాన్ని పాలించటానికి పనికి రాదన్నది మరో సమస్య. ఈ రెండు సమస్యలూ ఒక్క దెబ్బతో పరిష్కరించాలంటే ఒక్కటే మార్గం; ఆమెను పెళ్ళాడిన వాడికి రాజ్యాభిషేకం జరుగుతుందని ముందుగా ప్రకటించాలి. ఆమె కోసం కాకపోయినా రాజ్యం కోసమైనా ఆమెను పెళ్ళాడటానికి రాజకుమారులు ముందుకు రావచ్చు. అలా అని ఎవరో అడ్డమైనవాణ్ణి తన రాజ్యానికి వారసుణ్ణి చెయ్యటం రాజుకు ఇష్టం లేదు. మణిమంజరిని పెళ్ళాడేవాడు ఆమెను మార్చగలవాడూ, రాజ్యభారాన్ని నిర్వహించగలవాడూ కూడా అయి ఉండటం మంచిది.

ఈ దృష్టితో మణికేతమహారాజు రెండు దేశాల రాజకుమారులను, విజయుడూ, జయుడూ అనే వారిని మణిమంజరికి భర్తలుగా ఎన్నుకుని, వారికి ఆహ్వానాలు పంపి పిలిపించుకున్నాడు.

తరవాత అతను విజయుణ్ణి పిలిచి, ఏకాంతంగా అతనితో సంగతంతా చెప్పి, "మా అమ్మాయిని పెళ్లాడేవాణ్ణి నా రాజ్యానికి వారసుడుగా ప్రకటించ నిర్ణయించాను. అయితే మా అమ్మాయికి పట్టరాని

కోపం. ఆమెకు కారణంలేకుండా కూడా కోపం వస్తుంది. కోపం వచ్చినప్పుడు ఏం చేసినా చెయ్యగలదు. అపర దూర్వాసుడు! అందుచేత ఆమెను పెళ్ళాడా వంటే రాజ్యలాభంతోపాటు గయ్యాళి భార్యతో వేగవలసిన నష్టం కూడా ఉంటుంది. లాభనష్టాలు బేరీజు వేసుకుని నీ నిర్ణయం చెప్పు,'' అన్నాడు.

విజయుడు చిరాకుపడుతూ, "వెంటనే ముహూర్తం పెట్టించక, ఈ అనవసర ప్రసంగం అంతా దేనికి?'' అని దురుసుగా అన్నాడు.

రాజు అతన్ని పంపేసి జయుణ్ణి పిలిపించి, అతనితో కూడా విజయుడితో చెప్పినట్టే చెప్పాడు.

జయుడు శాంతంగా రాజు చెప్పినదంతా విని, ''మహారాజా, కోపస్వభావానికి మూలకారణం మనిషి బలహీనతే. అలాటి వాళ్ళను చూసి నేను జాలి పడతాను, అర్థం చేసుకుంటాను. మణిమంజరిని పెళ్ళాడటానికి నా కేమీ అభ్యంతరం లేదు,'' అన్నాడు.

ఇద్దరితోనూ మాట్లాడినమీదట మణిమంజరిని ఎవరికిస్తే బాగుంటుందో తెలిసిపోతుందనుకున్న మహారాజుకు ఏమీ తెలియలేదు. జయ, విజయులలో వ్యత్యాసం తెలుస్తున్నది గాని, వారిలో ఎవరికి పిల్లనివ్వటం వల్ల హెచ్చు లాభమో ఆయనకు తెలియలేదు. అందుచేత ఆయన తన మంత్రిని సలహా అడిగాడు.





మంత్రి రాజు చెప్పినదంతా విని రాజు కోరినట్టు సలహా ఇయ్యకపోగా, "మహారాజా, ఈ నిర్ణయం మీరే చెయ్యటం మంచిది. మీ కుమార్తె క్షేమమూ, రాజ్య క్షేమమూ మీకన్న మరొకరికి బాగా తెలుస్తుందా?" అని తప్పించుకోజూశాడు.

"రాజు అయినంత మాత్రానా, తండ్రి అయినంత మాత్రానా సర్వజ్ఞుడవుతాడా? నేను నిర్ణయించలేకనే గదా మిమ్మల్ని సలహా అడుగుతున్నాను. అడిగినప్పుడు సలహా ఇయ్యడం మీ విధి. అయితే, దాన్ని అమలు చెయ్యటానికీ, చెయ్యకపోవటానికీ బాధ్యుణ్ణి నేనే." అన్నాడు మణికేతుడు.

మంత్రి ఇక తప్పించుకోలేక, "విజయుడిది దుడుకు స్వభావం. అమ్మాయిగారు అతన్ని ఒక్క క్షణం కూడా భరించలేకపోవచ్చు. జయుడు సాధుస్వభావమూ, వినయమూ గలవాడు. అతని ప్రభావంతో అమ్మాయిగారు శాంతం అలవరుచుకోవచ్చు. జయుడి కిచ్చి ఆమెకు పెళ్ళి చేయటమే మంచిదని నా ఊహ. తరవాత తమ ఇష్టం," అన్నాడు.

మణిమంజరికీ, జయుడికీ పెళ్ళి జరిగింది. పెళ్లి అయినాక మణిమంజరి స్వభావం మెరుగుపడకపోగా మరింత అన్యాయంగా తయారయింది. ఆమెకు జయుడి పొడ అంటే గిట్టుతున్నట్టు లేదు. ఆమె తన భర్తతో రోజూ పోట్లాడుతున్నది. జయుడు ఆమె పట్ల ఎంతో ఓర్పు వహిస్తున్నాడు.

వారిద్దరికీ ఎప్పుడు సఖ్యం కుదిరితే అప్పుడు జయుడికి రాజ్యాభిషేకం చేద్దామనుకుంటున్న రాజు మంత్రితో, "మీరిచ్చిన సలహా పూర్తిగా వికటించినట్టు కనబడుతున్నది. జయుడి మంచితనాన్ని అమ్మాయి చేతగాని తనంగా భావిస్తున్నట్టున్నది. అతనికి ఎలా రాజ్యాభిషేకం చెయ్యటం? భార్యను దారిలో పెట్టలేనివాడు దేశాన్ని ఎలా దారిలో పెడతాడని అందరూ అడగరా?" అన్నాడు.

మంత్రి కొంచెం ఆలోచించి, "మీరు ఈ విషయం నన్ను సలహా అడిగి ఉండవలసింది కాదు. నేను ఆ మాట సూచిస్తే మీరు విన్నారు కారు. ఏ విషయంగానిఒకరిని సలహా అడిగేటప్పుడు ఆ విషయంలో సలహా చెప్పేవాడికి ఏ విధమైన ప్రమేయమూ లేకుండా చూసి అడగాలి," అన్నాడు.

రాజు తన తప్పు గ్రహించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మణికేతుడు తన మంత్రిని సలహా అడగటంలో చేసిన తప్పేమిటి? రాజు తనను సలహా అడిగి ఉండరాదని అనటంలో మంత్రి ఉద్దేశమేమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మణికేతుడు మంత్రిని సలహా అడిగి ఉండరాదన్నది నిజం. రాజు మంత్రి నుంచి సలహా కోరినది రెండు సమస్యల పరిష్కారం గురించి. ఒక సమస్య రాజకుమార్తెకు ఎవరు భర్తగా పనికివస్తారన్నది. రెండవ సమస్య మణికేతుడి అనంతరం ఎవరు రాజ్యం చెయ్యటానికి పనికివస్తాడన్నది. నిజానికి ఈ రెంటికీ ఒకే వ్యక్తి పనికరాకపోవచ్చు. కాని మంత్రి తన స్వార్థం చూసుకుని, రాజకుమార్తెకు భర్తగా పనికివచ్చేవాణ్ణి కాక తాను సులువుగా మంత్రి పదవి నిర్వర్తించటానికి అనుకూలుడైన రాజు కాగలవాడి పేరు సూచించాడు. అదే మరొక తటస్థుడైతే రెండు సమస్యల పరిష్కారాన్నీ సమదృష్టితో చూసి ఉండేవాడు. ఇక రాజు చేసిన తప్పేమిటంటే, మంత్రిని సలహా అడగటం కూడా కాదు, ఆ సలహాను గుడ్డిగా అమలుచేయటం. మంత్రి సలహాను గుడ్డిగా అనుసరించి, తన యోగక్షేమాలు ఆలోచించలేని రాజు చిక్కులో పడక తప్పదు." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# అందరిదీ ఒకటే దారి

రంగాపురం అగ్నిప్రమాదానికి గురి అయి ఊరు ఊరంతా తగలబడగా, ఒక్క కరణంగారి ఇల్లు మిగిలింది. ఇళ్ళు తిరిగి కట్టుకోవటానికి సహాయం చెయ్యమని గ్రామస్థులు కరణంగారిని కోరారు.

"నా ఇల్లు కూడా తగల బడ్డాక ఏకంగా సహాయం చెయ్యమని రాజుగారిని కోరదామనుకుంటున్నాను," అన్నాడు కరణం, తన ఇల్లు తగలబడనందుకు విచారిస్తున్నవాడల్లే.

మర్నాటికి కరణంగారి ఇల్లు కూడా తగలబడి పోయింది—కారణం ఏదైతే నేం?

వెంటనే కరణం గ్రామప్రముఖులను వెంటబెట్టుకుని రాజుగారి వద్దకు వెళ్ళి, తమ గ్రామం పూర్తిగా కాలిపోయిందనీ, దాన్ని తిరిగి నిర్మించటానికి ఆర్థికసహాయం చేయవలసిందనీ వేడుకున్నాడు.

రాజు తాపీగా, "కొంచెం ఆగండి. ఇంకా రెండు మూడు గ్రామాలు తగలబడినాక ఏకంగా అన్ని గ్రామాలకూ సహాయం చేస్తాను," అన్నాడు.

—రేవా నాగేశ్వరరావు.





# ఎదురు తిరిగిన న్యాయం

రామస్వామి వద్ద మంచి పాడి ఆవు ఉండేది. అది రోజూ పదిశేర్ల పాలిచ్చేది. ఆ పాలు అమ్ముకుని రామస్వామి సుఖంగా బతుకుతూ ఉండేవాడు.

ఆ వూరి గ్రామాధికారి భైరవశర్మకు ఆ ఆవు మీద కన్నుపడింది. ఆ ఆవును తనకు అమ్మమని అతను రామస్వామిని నాలుగైదుసార్లు అడిగాడు. అయితే రామస్వామి ఆవును అమ్మనని స్పష్టంగా చెప్పేశాడు.

కాని రామస్వామికి ఆవును అమ్మక తప్పలేదు. ఎందుచేతనంటే అతని కూతురి వివాహం వచ్చింది. గ్రామాధికారికే అమ్మవచ్చుగాని, అతను ఆవుకు తగిన ధర ఇయ్యడు. ఆవును అమ్మమని ముందుగా అడిగిన, భైరవశర్మను కాదని ఊళ్ళో మరొకరికి ఆవును అమ్మటం కూడా సాధ్యమయే పనికాదు.

అందుచేత రామస్వామి తన ఆవును రహస్యంగా పట్నంలోని పశువుల సంతకు తోలుకుపోయాడు. రామస్వామి ఆవును సంతకు తోలుకుపోవటం భైరవశర్మ కొడుకు నాగశర్మ గమనించి, ఎలాగైనా ఆ ఆవును కొని తండ్రి మెప్పు పొందాలని, ఎవరికీ చెప్పకుండా తానుకూడా సంతకు బయలుదేరాడు.

సాయంకాలం అయింది. రామస్వామి ఆవు కట్లు తెంచుకుని, సంత నుంచి వచ్చి, ఒక వరిచేనులోపడి మేస్తూండగా, చేనుగల రైతు దాన్ని పట్టుకుని, గ్రామాధికారి అయిన భైరవశర్మ వద్దకు తోలుకుని వెళ్ళాడు.

భైరవశర్మ రామస్వామి ఆవును చూసి ఆశ్చర్యపడి, ''ఏం, రామయ్యా? రామస్వామిగాడి ఆవును ఇలా తోలుకొచ్చావేం?" అని అడిగాడు.

పి. వి. యస్సెస్స్రాజు

''బాబుగారూ, ఈ ఆవు నా చేలోపడి, పంట అంతా నాశనం చేసింది. తమరే న్యాయం చెప్పి నాకు నష్టపరిహారం ఇప్పించాలి,'' అన్నాడు రామయ్య బిక్క మొహంతో.

రామస్వామి పైన చాలాకాలంగా కోపంతో ఉన్న భైరవశర్మకు మంచి అవకాశం చిక్కింది. ఈ దెబ్బతో రామస్వామి పొగరు అణచాలనుకుని, అతను అక్కడ చేరిన పెద్దలతో, ''పాపం, ఈ పేద రైతు రామయ్య, సంవత్సరమంతా కష్టపడి పెంచిన చేను పాడు చేసేసింది ఈ ఆవు. బాధ్యత కొంచెమైనా లేకుండా ఆవును ఇలా వదిలిపెట్టినందుకుగాను రామస్వామి నష్టపరిహారాన్ని చెల్లించటం న్యాయం. అందుచేత రామస్వామి ఈ రామయ్యకు రెండు రోజుల గడువు లోపల, రెండు వేల రూపాయలు చెల్లించాలి,'' అన్నాడు.

''బాగుంది! బాగుంది!'' అన్నారు అక్కడ చేరినవారంతా.

అంతలో, భైరవశర్మ కుమారుడు నాగశర్మ పరిగెత్తుకుంటూ వచ్చి, ''అరె! ఈ ఆవు ఇక్కడికి వచ్చిందా? దీని కోసం ఊరంతా వెతుకుతున్నాను,'' అన్నాడు.

భైరవశర్మ ఆశ్చర్యపోతూ, ''ఈ ఆవు గురించి ఊరంతా తిరగవలసిన కర్మ నీకేం పట్టిందీ?'' అని కొడుకును అడిగాడు.

''సంతలో రామస్వామి దగ్గిర దీన్ని కొనేశాను, నాన్నా!'' అన్నాడు నాగశర్మ.

ఆ మాట వినగానే భైరవశర్మ గుండెల్లో రాయిపడింది. నాగశర్మ రామస్వామి దగ్గిర కొన్న తరవాతే ఆవు పారిపోయి వచ్చి రామయ్య చేనులో పడినట్టు స్పష్టమయింది. ఆవు ఎవరికి చెందినా, పది మందిలో చెప్పిన న్యాయానికి తిరుగు ఉండదుగదా!

రామయ్యకు ఇచ్చుకోవలసిన నష్టపరిహారం రెండువేలూ నాగశర్మ ఇచ్చుకోక తప్పలేదు. తన తీర్పు తననే ఎదురు కొట్టటంతో భైరవశర్మ హతాశుడైపోయాడు.



# మంత్రి యుక్తి

పూర్వం కిల్మంగేరిదేశంలో ఒక దొంగలముఠా తరచు దొంగతనాలు చేస్తూండేది. దొంగలను పట్టటానికి రాజు విశ్వప్రయత్నాలు చేసిన మీదట ఒక్క దొంగ పట్టుబడ్డాడు. వాణ్ణి రాజు నేరవిచారణ చేసి, శిక్ష చెప్పబోయే సమయంలో మంత్రి లేచి, "వీడి నేరాలకు ఏడుసంవత్సరాల కారాగారశిక్ష విధించవచ్చు. కాని వీణ్ణి వదిలేసి, సరి అయిన మార్గంలో నడుచుకునే అవకాశం ఇయ్యటం మంచిది," అన్నాడు.

రాజుకు ఇష్టం లేకపోయినా, మంత్రి మీది గౌరవం కొద్దీ దొంగను వదిలేశాడు. వారం రోజుల తరవాత పదిమంది దొంగల ముఠా పట్టుబడింది. అందులో, మొదట దొరికి, క్షమించ బడిన దొంగా, ముఠానాయకుడూ కూడా ఉన్నారు.

మంత్రి యుక్తి పారింది. విడిచి పెట్టగానే దొంగ తన ముఠావాళ్ళను కలుసుకున్నాడు. వాణ్ణి రహస్యంగా అనుసరించే చారులకు దొంగల ఆచూకీ పూర్తిగా లభించింది. మంత్రిని సభలో అందరూ మెచ్చుకున్నారు.

—కోలార్ కృష్ణఅయ్యర్.





# ఎవరు మనిషి?

ఒక గ్రామంలో కనకదంతుడు అనే గొప్ప ధనవంతుడు ఉండేవాడు. అతనికి ఎంత సంపద ఉన్నా తృప్తి ఉండక పోవటం చేత, తన సంపదను పెంచుకోవటానికి ఎంతటి ఘోరాలైనా చేసేవాడు. ఎన్నో కుటుంబాలు అతని ధనదాహం మూలాన నాశనమై పోయాయి. అతను మొత్తం గ్రామాన్నే పీల్చి, పిప్పిచేశాడు.

అతని భార్య సుమతి కల్లా, కపటమూ లేని ఇల్లాలు. సాటిమనుషులంటే ఆమెకు ఎంతో అభిమానం, కష్టాల్లో ఉన్నవారిని చూసి కరగిపోయేది. తన భర్త వైఖరి ఆమెకు కొంచెం కూడా నచ్చేదికాదు. "మనకు ఉన్నది చాలదా? ఇంకెంత కాలం, ఇలా మనుషుల నెత్తురు తాగుతారు?" అని భర్త మనసు మార్చటానికి ప్రయత్నించేది. ఆమెపట్ల ప్రేమానురాగాలున్నా, ఆమె మాటల్ని మాత్రం కనకదంతుడు ఏ మాత్రం పట్టించుకునేవాడు కాదు.

ఇలా ఉండగా, ఎక్కడి నుంచో దయానిధి అనే యోగి ఆ ప్రాంతాలకు వచ్చి, ఆ గ్రామం పొలిమేరలో ఉన్న ఏటి గట్టున కుటీరం నిర్మించుకుని, ఆశ్రమం ఏర్పాటు చేసుకున్నాడు. ఆ ఆశ్రమంలో ఆయన అనేక పళ్ళచెట్లు నాటించాడు. వాటిలో ఒక మామిడిచెట్టు తొలికాపు కాసింది. ఆ చెట్టు పళ్ళను గురించి జనం విడ్డూరంగా చెప్పుకోసాగారు. దానికి కారణం ఏమంటే, ఆ చెట్టు కిందికిపోయి, దాని పండు కోసి తిన్నవాడు, తన స్వభావానికి తగిన విధంగా ఏదో ఒక జంతువుగా మారిపోతాడు; చెట్టు కింది నుంచి ఇవతలికి రాగానే మళ్ళీ మామూలు మనిషి అవుతాడు!

కలువకొలను సదానంద

అనేకమందికి ఇలా జరగటం ప్రజలు కళ్ళారా చూశారు. ఈ వింత చూడటానికి కనకదంతుడూ, అతని భార్యా ఆశ్రమానికి వెళ్ళారు. అక్కడ జనం గుమికూడి వేడుక చూస్తున్నారు.

అందరూ చూస్తూండగానే ఒక వయసు మళ్లిన వీరయోధుడు ఒకప్పుడు సైనికుడుగా అనేక యుద్ధాలలో పాల్గొన్నవాడు, చెట్టు కిందికి వెళ్లి, పండు తిని, పెద్దపులిగా మారి, గాండ్రుమంటూ జనం మీదికి దూకి, వెంటనే మామూలు మనిషిగా మారిపోయాడు.

అదేవిధంగా, ఆ గ్రామానికి చెందిన వీధి బడిపంతులు గంగిగోవుగా మారిపోయాడు. తన శత్రువుల పంటకుప్పలకు నిప్పుపెట్టిన వాడొకడు కోడెతాచుగా మారి బుసలుకొట్టాడు. కనకదంతుడి సేవకుడొకడు కుక్కగామారి, భౌ, భౌ మని మొరిగాడు. అడ్డమైన వాళ్ళకూ మెట్ట వేదాంతం బోధించేవాడు ఒకడు గాడిదగా మారి, ఓండ్రపెట్టాడు. ఇలా అనేక మందికి జరిగిన మీదట గ్రామస్థులలో చాలామంది, తమ నిజమైన స్వభావం తెలుసుకోవాలని ఉన్నా, లోకానికి తెలియనియ్యటం ఇష్టంలేక పండు తినటానికి భయపడ్డారు.

తాను కూడా చెట్టు కిందికి వెళ్ళి, పండు తిని ఎలా మారేదీ తెలుసుకోవాలన్న ఉబలాటం కనకదంతుడికి కూడా కలిగింది. అయితే, తనలాంటి గొప్ప



వాడు – పేరూ, పలుకుబడీ ఉన్నవాడు – పందిగానో, గాడిదగానో మారితే నలుగురిలో చులకన అయిపోక తప్పదు గదా? అందుచేత అతను రహస్యంగా పండు తినాలనుకున్నాడు.

ఆ రోజు అర్ధరాత్రి అతను సుమతిని వెంటబెట్టుకుని, ఎవరూ చూడకుండా ఆశ్రమం చేరుకున్నాడు. ఇద్దరూ మామిడి చెట్టు కిందికి వెళ్లి, చెరొక పండూ కోసి తిన్నారు. సుమతిలో ఏ మార్పూ రాలేదు గాని, కనకదంతుడు బ్రహ్మరాక్షసిగా మారిపోయి, ''నరవాసన! నరవాసన! ఆకలి! ఆకలి!'' అని అరుస్తూ, సుమతిని పట్టుకోబోయాడు. ఆమె భయపడిపోయి, అతనికి అందకుండా తప్పించుకుని, గ్రామం కేసి పరుగు తీసింది. ఆమె వెంటపడిన కనకదంతుడు యథారూపం పొంది, భార్యను ఆగమని కేకలు పెట్టినా ఆమె వినిపించుకోలేదు.

తరవాత సుమతి తన భర్తతో కాపరం చేయ నిరాకరించింది. కనకదంతుడు ఆశ్రమానికి వెళ్ళి, దయానిధిని బతిమాలి వెంటబెట్టుకు వచ్చాడు.

దయానిధి ఆమెతో, "అమ్మా, నీకొచ్చిన భయమేమీ లేదు. నీ భర్తలో రాక్షసుడి లక్షణాలున్నాయే మోగాని, అతను నిజంగా రాక్షసుడు కాదుగదా! ఆ చెట్టు కింద పండు తిన్నప్పుడే అతనికి రాక్షసుడి ఆకారం వచ్చింది. ఆ చెట్టు కొట్టించేశాను. ఇక నీ భర్త రూపం మారే ప్రమాదం లేదు. నువు నీ భర్తతో హాయిగా కాపరం చేయవచ్చు.'' అని, కనకదంతుడితో, ''నాయనా, అన్ని ప్రాణులలోకీ ఉత్తముడు మనిషి. మనిషిగా పుట్టినవాడు మనిషిగా బతకాలి. అలాటప్పుడు నువు నరభక్షకుడిలాగా బతుకుతున్నావంటే ఎంత సిగ్గుచేటు?'' అన్నాడు.

కనకదంతుడు సిగ్గుపడనే పడ్డాడు. ఆ తరవాత అతను తనకు పట్టిన కళంకం పోగొట్టుకోవటానికి భార్య మాట వింటూ వచ్చాడు.



# అధ్యక్షుడి తెలివి

జీవకారుణ్య సంఘం అధ్యక్షుడికి సమావేశం ఏర్పాటు చెయ్యటం పెద్ద సమస్యగా ఉండేది. సమావేశం పెడితే ఎవరూ రారు. అందుకని ఒకరోజు సమావేశానికి జమీందారుగారు అధ్యక్షత వహిస్తున్నట్టు కబురుచేశాడు. సభికులందరూ వచ్చారు. కాని జమీందారు రావటం లేదని తెలిసి, వాళ్ళువెళ్ళిపోయే ప్రయత్నంలో ఉన్నారు.

అది గ్రహించి అధ్యక్షుడు, "మిత్రులారా, మీలో ఎవరో బాడుగబండిలో వచ్చి బండివాడికి కిరాయి ఇయ్యకుండా వాణ్ణి బయటనిలబెట్టారట. జీవకారుణ్యసంఘ సభ్యులలో గుర్రంపట్ల, బండివాడిపట్లా అంత అక్రమంగా ప్రవర్తించేవారుంటారనుకోను. ఎవరైనా మరిచిపోయి అలా చేసి ఉంటే, వారు బయటికివెళ్ళి బండివాడికి డబ్బులు ఇచ్చేయ్యండి," అన్నాడు.

సమావేశం అయినదాకా ఎవరూ లేవలేదు.

—ఎమ్. డి. సౌజన్య





# శీలపరీక్ష

ప్రతాపగడ్ జమీందారు రుద్రనారాయణ కొడుకు రవినారాయణ అందగాడూ, బుద్ధిమంతుడూనూ. అతనికి సుఖసాగర గ్రామంలోని జమీందారు కూతురు సులతను ఇచ్చి పెళ్ళిచేశారు. రెండు గ్రామాల మధ్య చాలాదూరం. రాక పోకలకు సౌకర్యాలు లేవు. మధ్య అరణ్యం కూడా ఉన్నది. ఆ ప్రాంతంలో సాగరదిఘీ అనే కోనేరు ఉన్నది. దాని చుట్టూ మామిడితోపు ఉన్నది. ఈ ప్రదేశం బందిపోటు దొంగలకు ప్రసిద్ధి.

సులత రవినారాయణను పెళ్ళాడి కాపరానికి వచ్చి, తన సౌజన్యంతో అందరికీ అభిమానపాత్రురాలయింది. ఇంతలో ఒకనాడు సుఖసాగర నుంచి కొందరు మనుషులు వచ్చి రుద్రనారాయణను కలుసుకుని, సులత తల్లికి చాలా జబ్బుగా ఉన్నదనీ, సులతను తమ వెంట పుట్టింటికి పంపవలసిందనీ కోరారు. ఈ మాట అడిగినవాడు సుఖసాగర జమీందారుగారి దివానే. కాదనటానికి లేదుగనక రుద్రనారాయణ సులత వెళ్ళటానికి అనుమతినిస్తూ, దొంగలతో పోరాడగల సాయుధ సిబ్బందిని తాను కూడా ఆమెకు తోడు పంపాడు.

ప్రయాణం సుఖంగానే ప్రారంభమయింది. మేనా తలుపు రెక్క ఒకటి తెరిచి, దానిగుండా దారివెంబడి ప్రకృతి సౌందర్యాన్ని చూసి సులత ఆనందం పొందింది. మధ్యాన్నం భోజనాల వేళకు ఒక పెద్ద మర్రిచెట్టు కింద మజిలీ చేశారు. అందరూ భోజనాలు చేసి, ఒక గంట విశ్రాంతి తీసుకున్న అనంతరం మళ్ళీ ప్రయాణం సాగింది.

సాగరదిఘీ కనుచూపు మేరలోకి వచ్చేసరికి సూర్యాస్తమానమయింది.



ఆ దౌర్భాగ్యపు ప్రదేశం కంటపడగానే సులత అందోళన చెంది, తన తండ్రీ, మామగారూ పంపిన అంగరక్షకుల నాయకులకు తన భయాన్ని వెల్లడించింది.

''ఏమీ భయంలేదు, తల్లీ. బందిపోటు వచ్చేమాటుంటే వాళ్లని ప్రాణాలతో వదలం. వాళ్ళను ఎదుర్కోవటం మాకు అలవాటే.'' అని వాళ్లు సులతకు ధైర్యం చెప్పారు.

కాని అలా జరగలేదు. అసంఖ్యాకులైన బందిపోటు దొంగలు, "హర హరా!" అని దారుణంగా అరుస్తూ, గడల మీద ఎక్కి అమిత వేగంగా కదులుతూ వచ్చిపడి, భయంకరంగా పోరాడి, చాలా మంది అంగరక్షకులను చంపారు. మరి కొందరు అంగరక్షకులు గాయపడ్డారు. మిగిలినవాళ్లు పారిపోయారు.

చీకటి పడుతున్నది. దొంగలు దివిటీలు వెలిగించి, మేనాను సమీపించారు. సులత తన ఒంటి మీది నగలు తీసి మూటగట్టి, దొంగల కేసి విసిరింది.

''మేనాను ఎత్తుకుని మన స్థావరానికి పదండి,'' అని దొంగల నాయకుడు ఉత్తరు విచ్చాడు. నలుగురు దొంగలు మేనాను భుజాల కెత్తుకున్నారు. ఒక దొంగ మేనా వెంట నడిచాడు. వాడు తన కేసి ఆశగా చూస్తూండటం గమనించి సులత వాడి కేసి ఒక చిరునవ్వు విసిరి, చిన్న నగతీసి ఇచ్చింది. వాడు దాన్ని ఆత్రంగా తన జేబులో పెట్టుకున్నాడు. తరవాత ఆమె వాడికొక తమలపాకు చిలక అందించి, తాను మరొకటి నోట వేసుకున్నది. దొంగ ఆ తమలపాకు చిలకను కొరికిన మరుక్షణం చచ్చి పడిపోయాడు.

మేనా మోస్తున్న దొంగలు, మేనాను దించి, తమ అనుచరుడికి ఏమయిందో చూడబోయారు. అందరూ చచ్చినవాడి చుట్టూ మూగారనీ, మేనాకు కాపలా లేదనీ తెలిసి, సులత అవతలి పక్క నుంచి మేనా దిగి బయటపడి, అరణ్యం



లోకి జారుకున్నది. ఆమె అరణ్యంలోకి చాలాదూరం పరిగెత్తి, ఒక చెట్టు ఎక్కి, చీరపయటతో తనను తాను చెట్టుకు కట్టేసుకుని, స్పృహకోల్పోయింది.

సులత పుట్టింటి నుంచి కాపరానికి వచ్చేటప్పుడు విషంగల తమలపాకు చిలకలు రెండు తెచ్చుకున్నది. మానహాని తటస్థించే పరిస్థితిలో అవి ఉపయోగిస్తాయి.

దొమ్మి జరిగిన చోట బందిపోటు దొంగలు చచ్చిన తమ వారినీ, గాయపడిన వారినీ తీసుకుని వెళ్లిపోయారు. వారు వెళ్ళిన అనంతరం సులత వెంట వచ్చిన వారిలో పారిపోయినవాళ్ళు తిరిగి వచ్చారు. పరివారంలో ముఖ్యులు చాలా మంది పోయారు. గాయపడిన వారికి కొద్దిగాయాలు తగినవాళ్ళు చికిత్సలు చేస్తున్నారు.

తెల్లవారింది. దొంగల దాడి గురించీ, సులత జాడ తెలియకపోవటం గురించీ వార్త ఇటు ప్రతాపగడ్‌కూ, అటు సుఖసాగర్‌కూ చేరింది.

సులత చెట్టు ఎక్కినప్రాంతంలో హరిదాసు అనే వైష్ణవసాధువు ఆశ్రమం ఉన్నది. అతను పూజకుగాను పూలు కోయటానికి వచ్చి, చెట్టు మీద ఉన్న సులతను చూశాడు. అతను చెట్టు మీదికి ఎక్కి, చెట్టుకొమ్మ నుంచి సులతను విడిపించి, తాడు సహాయంతో ఆమెను కిందికి దించి, తన ఆశ్రమానికి తీసుకుపోయి, స్పృహతెప్పించి, ఆమెకు తన శుశ్రూషల ద్వారా బలం తెప్పించాడు. తరవాత ఆమె తన తండ్రి ఇంటికి పోతానన్న మీదట, అతను ఆమెను సుఖసాగరకు చేర్చాడు.

సులత పుట్టింటికి చేరిందన్న వార్త ప్రతాపగడ్‌లో ఏమంత ఆనందం కలిగించలేదు. బందిపోటు చేతికి చిక్కిన ఆడదాని శీలం ఏం నిలుస్తుంది?

తాను తన భర్త వద్దకు తిరిగి పోయే అవకాశం లేదనీ, తనను తన అత్తవారు

ఏలుకోరనీ, తనకు ఆత్మహత్య తప్ప మార్గంలేదనీ సులత హరిదాసుతో అన్నది.

"అమ్మా, నువు నిర్దోషివని నా అంతరాత్మ స్పష్టంగా చెబుతున్నది. నువు తొందరపడి ప్రాణం తీసుకోకు. నేను మీ మామగారినీ, భర్తనూ కలుసుకుని మాట్లాడతాను. నీ శీలం చెడలేదని వారిని నమ్మించ యత్నిస్తాను," అని హరిదాసు అన్నాడు.

త్వరలోనే హరిదాసు ప్రతాపగడ్‌కు పోయి, రహస్యంగా రవినారాయణను కలుసుకుని, రవినారాయణకు సులత పవిత్రురాలని నమ్మకం ఉన్నదనీ, అతను ఆమెను ఇంకా ప్రేమిస్తున్నాడనీ తెలుసుకున్నాడు.

"కాని మా నాయనగారు పాతకాలపు మనిషి, పట్టుదలగల వాడు. గట్టి నిదర్శనం కనిపిస్తేనేగాని ఆయన మనసు మారదు. దాన్ని ఎలా మార్చుతావో, నీదే పూచీ," అన్నాడు రవినారాయణ హరిదాసుతో.

హరిదాసు ముఖాన చిరునవ్వు అంకురించింది. అతను సులతనూ, ఆమె తండ్రినీ తీసుకుని ప్రతాపగడ్ చేరాడు. రుద్రనారాయణ తన కోడలిని తన ఇంట అడుగు పెట్ట నియ్యలేదు. హరిదాసూ, సులతా అతిథిగృహంలో బసచేశారు.



హరిదాసు రుద్రనారాయణతో, "సులత పవిత్రురాలని తెలుసుకున్నాను. ఆమెను దొంగలు తాకనైనాలేదు," అన్నాడు.

"మీ మాట నాకు చాలదు. అవతల గ్రామస్థులు ఉన్నారు. నేను సులతను స్వీకరించితే వారు నన్ను ఆక్షేపించవచ్చు," అన్నాడు రుద్రనారాయణ.

"అలా అయితే దైవనిర్ణయం మీద ఆధారపడదాం. అద్భుతమైన దాఖలా ఏదన్నా కనిపిస్తే మీకు అభ్యంతరం ఉండదుగా?" అన్నాడు హరిదాసు.

"అలాటిది ఎవరికి మాత్రం అభ్యంతరం ఉంటుంది?" అన్నాడు రుద్రనారాయణ.

రుద్రనారాయణ ఇంటి చావడిలో ఆయన బంధుమిత్రులంతా సమావేశ మయారు. సులతా, ఆమె తండ్రీ కూడా అక్కడికి వచ్చారు. హరిదాసు ఒక గాజు లోటా, ఒక మైనం ఉండా, పట్కారూ తెచ్చి రుద్రనారాయణకు చూపాడు. అతను ఒక చిన్న బల్ల తెచ్చి, రుద్ర నారాయణ ముందు పెట్టాడు. లోటాలో గంగాజలం పోసి, హరిదాసు రుద్ర నారాయణను పట్కారు సహాయంతో మైనం ఉండను నీటి అడుగున పెట్ట మన్నాడు. అయితే ఆ ఉండను పట్కారు వదిలిపెట్టగానే నీటి పైకి తేలింది. ఎంత మంది ఆ ఉండను నీటిలో ముంచటానికి ప్రయత్నం చేసినా అది నీటి పైకే తేలింది.

తరవాత హరిదాసు సులతను పిలిచి, "అమ్మా, నీ పవిత్రతతో నువు ఈ ఉండను నీటిలో మునిగి ఉండేటట్టు చేయగల వేమో చూడు. సీతాదేవిలాటిది తన పాతివ్రత్యం రుజువు చేసుకున్నది. నువు కూడా ఆ పని చెయ్యి," అంటూ బల్లను ఆమెకు సమీపంగా జరిపి, గాజు లోటాను బల్ల కొస ఉంచాడు. సులత మైనం ఉండను పట్కారుతో పట్టుకుని, నీటిలో పెట్టి, పట్కారును విడిపించింది. ఉండ నీటి అడుగునే ఉండిపోయింది, పైకి లేవలేదు.

అందరూ హర్షధ్వానాలు చేశారు. సులతను మామగారు సగౌరవంగా స్వీక రించాడు. తరవాత హరిదాసు జమీం దార్లను ఏకం కమ్మనీ, సాగరదిఘీ ప్రాంతంలో బందిపోటుల బెడద శాశ్వ తంగా తొలిగిపోయేటట్టు చర్యలు తీసు కోమనీ హెచ్చరించాడు.

అతను చేసిన ఇంద్రజాలం రహస్యం ఏమిటి? ఆ మైనం ఉండ అచ్చగా మైనం ఉండ కాదు. బోలుగా ఉండే చిన్న ఇనప ఉండమీద మైనం పొదిగారు. మైనం కారణంగా అది నీటి పైకి తేలింది. అయితే బల్ల కొస కింద బలమైన అయ స్కాంతం ఉంది, ఇనుమును ఆకర్షించి, ఉండ తేలకుండా చేసింది.





# తిరిగి వచ్చిన హారం

రామయ్యా, రంగయ్యా అన్నదమ్ములు. తండ్రి ఇల్లు పంచుకుని, వేరు వేరు వాటాలలో ఉంటున్నారు. రామయ్య భార్య జానకమ్మ చాలా యోగ్యురాలు.

రంగయ్య భార్య కామాక్షి అందుకు పూర్తిగా వ్యతిరేకం. తన తోడికోడలు కుటుంబం పచ్చగా ఉండటం చూసి కామాక్షి ఓర్చలేకపోయేది.

కొంతకాలానికి జానకమ్మ తన పొదుపుతో డబ్బు వెనకవేసి, చంద్రహారం చేయించుకున్నది. అది చూసినప్పటి నుంచీ కామాక్షికి నిద్రపట్టలేదు. ఒక రోజు ఆమె జానకమ్మతో, "అక్కా, నీ హారం ఒకసారి అరువిస్తావా? అటువంటిదే చేయించుకోవాలని మనసయింది." అన్నది.

జానకమ్మ వెంటనే తన హారం తెచ్చి తోడికోడలికి ఇచ్చింది.

ఎన్నిరోజులు గడిచినా కామాక్షి జానకమ్మకు ఆమె హారం తిరిగి ఇయ్యలేదు. జానకమ్మ కొన్నాళ్లు ఓపికపట్టి, ఒకరోజు కామాక్షిని తన నగ గురించి అడిగింది.

"ఏం హారం? నాకు పెట్టెడు నగలుండగా నీ నగే కావలసి వచ్చిందా? ఎవరన్నా నమ్మే మాటేనా? మమ్మల్ని నలుగురిలో అల్లరి చేద్దామనుకుంటున్నావా? పద, పద!" అని కామాక్షి దౌర్జన్యంగా మాట్లాడింది.

జానకమ్మకి కళ్ళనీళ్ళ పర్యంతమయింది. హారం కాజేసింది కాక, తనను అవమానించినందుకు చాలా బాధపడి, మారుమాట్లాడకుండా జానకమ్మ తన ఇంట్లోకి వచ్చేసింది.

ఆమె ఈ విషయం తన భర్తతో చెబితే, అతను తేలికగా తీసుకుని, "పోనిద్దూ! పరాయివాళ్ళు కారుగదా!" అనేశాడు.

బొమ్మిడి అచ్చారావు

ఇలా ఉండగా ఓ రోజు జానకమ్మ కూతురు పుట్టింటికి వచ్చి, తన తల్లికి జరిగిన అన్యాయం గురించి విన్నది. తన తల్లికి జరిగిన అవమానానికి ప్రతిక్రియ చేయాలని నిశ్చయించుకున్నది. కామాక్షి తనను చూడటానికి ఎలాగూ వస్తుంది. అప్పుడు ఏం చెయ్యాలో ఆమె తన తల్లికి చెప్పింది.

కామాక్షి తన బావగారి కూతుర్ని చూడటానికి రానే వచ్చింది. ఆమె తమ వాటాలో అడుగుపెట్టటం జానకమ్మ కూతురు చూసి కూడా, చూడనట్టుగా తల్లితో, "అమ్మా, నువు ఏదో చంద్రహారం చేయించుకున్నావని విన్నాను. నాకు చూపించనే లేదే!" అన్నది.

కామాక్షి ఆగిపోయి ఈ మాటలు విన సాగింది.

"అది చేయించున్న నగ కాదమ్మా! ఎవరో మీ నాన్నకు అమ్మ జూపితే అది చవకగా వస్తున్నదని కొనేశారు. తరవాత తెలిసింది. అది దొంగ సొమ్మని! అయితే అదృష్టవశాన దాన్ని వదిలించేసుకున్నాను లే," అన్నది జానకమ్మ తన కూతురితో.

"అదెలాగ?" అని కూతురు ఆశ్చర్యంగా అడిగింది జానకమ్మను.

"దాన్ని మీ పిన్నికి అరువిచ్చాను. మీ పిన్ని దాన్ని తనదగ్గిరే ఉంచేసుకున్నది. ఇంతలో అది దొంగ సరుకని తెలిసింది. అందుకే, మీ పిన్ని నగ తీసుకోలేదని అబద్ధమాడినా, మాట్లాడక ఊరుకున్నాను. నేడో, రేపో రక్షకభటులు సోదాకు రాక పోరు. మన దగ్గిర నగలేదుగదా, మన కేం భయం? సరుకు ఎవరిదగ్గిర దొరికితే వాళ్ళనే పట్టుకుపోయి, నిజం చెప్పించటానికి చిత్ర హింసలు పెడతారు," అన్నది జానకమ్మ.

ఈ మాటలు విన్న కామాక్షికి కాళ్ళు వణికాయి. ఆమె లోపలికి రాకుండానే తమ వాటాలోకి వెళ్ళిపోయింది.

తెల్లవారేసరికి చంద్రహారం జానకమ్మ ఇంట్లో పడి ఉన్నది. తమ పథకం పారినందుకు తల్లీ కూతుళ్ళు సంతోషించారు.






# పశువులకాపరి దానయ్య

దానయ్య అమాయకుడు. తన ఊళ్లో బతుకు తెరువు లేక, అతను రాంనగరు వచ్చి, రంగయ్య ఇంట పశులకాపరిగా చేరాడు.

ఒకరోజు దానయ్య ఎడ్లను గాడికి కట్టుతూండగా, రంగయ్య భార్య గౌరమ్మ అతనితో, "బర్రె రాలేదు. దూడ అరుస్తున్నది. త్వరగా వెళ్లి, బర్రెను వెతికి తీసుకురా," అన్నది.

అప్పటికే చీకటి పడింది. ఉదయం ఎప్పుడో నాలుగు మాడు మెతుకులు తిన్న దానయ్యకు చాలా ఆకలిగా ఉన్నది. ఆ మాట గౌరమ్మకు చెప్పుకున్నా లాభం ఉండదనుకుని, అతను గొంగళి కప్పుకుని, కర్ర తీసుకుని బయలుదేరాడు. ఎంత వెతికినా బర్రె కనబడలేదు, కాని అతని కాళ్లు మాత్రం తెగ పీకాయి. అడుగుతీసి అడుగు వెయ్యలేనంత నీరసం వచ్చేసింది. ఇంటికి వెళితే గౌరమ్మ తన ప్రాణాలు తోడేస్తుంది. అందుకని దానయ్య ఒక పాడుబడిన దేవాలయంలో ఒక మూల ఒదిగి పడుకున్నాడు.

అర్ధరాత్రి దాటినాక ఇద్దరు దొంగలు అక్కడికి వచ్చి, "ఈ నగలు మన వెంట ఉంచుకోవటం క్షేమం కాదు. దొంగతనం గురించి సద్దుమణిగిన తరవాత తీసుకుపోవచ్చు. అంతదాకా వీటిని ఇక్కడ దాచి ఉంచుదాం," అనుకుని, ఆ చీకట్లో ఒక మూల గుంట తవ్వి, ఒక నగలమూటను అందులో పెట్టి మట్టి కప్పి, వెళ్ళిపోయారు.

ఆ నగలమూటను తీసుకుపోయి గౌరమ్మకు ఇస్తే, బర్రె దొరకనందుకు చివాట్లు తప్పుతా యనుకుని, దానయ్య ఆ నగలమూటను తీసుకుని ఇంటికి

వి. యజ్ఞరామయ్య



వెళ్ళాడు.

బర్రెలేకుండా అర్ధరాత్రిదాటి వచ్చిన దానయ్యను చూసి మొదట గౌరమ్మ మండిపడినా, అతను తెచ్చిన నగల మూటను చూసి పరమానందం చెందింది.

''ఆకలి మండిపోతున్నది, నాలుగు మెతుకులు పెట్టండి, అమ్మగారూ ?'' అన్నాడు దానయ్య.

''నీకోసం చూసి, చూసి అన్నం కుక్కకు పెట్టేశాను. ఇప్పుడేమీ లేదు,'' అంటూ గౌరమ్మ తలుపు వేసుకున్నది,

నీరసంతోనూ, నిరాశతోనూ దానయ్య కాళ్లీడ్చుకుంటూ వెళ్లి, పశువులకొట్టంలో పడుకున్నాడు.

నిద్రపోతున్న భర్తను లేపి, గౌరమ్మ నగలమూటను చూపింది. మూట విప్పి నగలను చూడగానే రంగయ్యకు గుండె ఆగినంతపని అయింది.

''ఇవి మామూలు నగలు కావు. మహారాజులు ధరించేవి. ఇవి మన దగ్గర ఉన్నట్టు తెలిస్తే మన ప్రాణాలు దక్కవు,'' అన్నాడు రంగయ్య.

''మనం తెలియనిస్తేగదా తెలిసేది?'' అన్నది గౌరమ్మ.

''మనమే తెలియనియ్యాలా ఏమిటి ? దీన్ని తెచ్చిన దానయ్య పొరపాటున ఎవరితో వీటిమాట చెప్పినా మన కొంప కూలినట్టే !'' అన్నాడు రంగయ్య.

తెల్లవారినదాకా ఆ నగలు దక్కించుకునే ఉపాయం ఆలోచించిన గౌరమ్మ దానయ్యను లోపలికి పిలుచుకువచ్చి, ''దానయ్యా, మమ్మల్ని ఇంత మోసం చేస్తావా ? మూటలో నగలున్నాయని అబద్ధం చెబుతావా?'' అని అతని మీద మండిపడింది.

అసలే అమాయకుడైన దానయ్య, ''నేను చూడలేదు అమ్మగారూ. దొంగలు అనుకున్న మాటలు మాత్రం విన్నాను,'' అన్నాడు దిగాలుపడి.

''ఇంకా నయం ! వెంటనే చూసు

కున్నాను గనక ఈ మూటలోనివి గులక రాళ్ళని తెలిసిపోయింది. పూర్తిగా తెల్ల వారకముందే ఈ గులకరాళ్ళమూటను ఎక్కడినుంచి తెచ్చావో అక్కడే పడేసి రా,'' అంటూ గౌరమ్మ రాళ్ళమూటను దానయ్యకు ఇచ్చింది.

దానయ్య ఆ మూటను తీసుకుపోయి, పాడుబడిన దేవాలయంలో ఒక మూల పాతిపెట్టడం దొంగల కంటపడింది. వాళ్ళకు అనుమానం వేసింది. వాళ్లు దానయ్యను వెంబడించి, అతను రంగయ్య ఇంట్లోకి వెళ్ళటం చూశారు.

ఆ రాత్రి వాళ్లు దేవాలయంలో మూటను తవ్వి తీసి, అందులో గులకరాళ్లు ఉండటం చూశారు.

ఈలోపల చాటింపు జరిగింది. రాణిగారి నగలను దొంగలు ఎత్తుకుపోయారు; దొంగలను పట్టిఇచ్చినవారికి రాజుగారు వెయ్యిరూపాయలు బహుమానం ఇస్తారు అన్న చాటింపు విని రంగయ్య భయపడ్డాడు.

''ఎందుకండీ భయం? మూటలో ఉన్నవి గులకరాళ్ళేగా ?'' అంటూ గౌరమ్మ తన భర్తకు తాను పన్నిన యుక్తి చెప్పింది.

నాలుగురోజులపాటు ఎవరినోట విన్నా రాణిగారి నగల దొంగతనం మాటలే. ఆ తరవాత క్రమంగా ఆ విషయం మరుగుపడింది.

గౌరమ్మకు కాస్త ధైర్యం వచ్చింది.



ఆమెకు నగలు పెట్టుకోవాలని కోరిక పుట్టింది. రాత్రి అందరూ నిద్రపోయాక, ఆమె నగలను ధరించి, అద్దంలో తనను తాను చూసుకుని మురిసిపోసాగింది.

ఇంట్లో ఎవరో మసులుతున్నట్టు తోచి, అనుమానం కలిగి, దానయ్య లేచివచ్చి, తలుపుసందుల గుండా గౌరమ్మనూ, ఆమె ధరించిన నగలనూ చూసి ఆశ్చర్య పోయి, తనను ఆమె మోసంచేసింది గదా అనుకుని, పశువుల పాకలోకి వెళ్ళి పడు కున్నాడు. కాని అతనికి నిద్ర పట్టలేదు.

ఇంతలో దొంగలు వచ్చి, "బావా, బావా !" అంటూ ఇంటితలుపు తట్టారు

"ఎవరూ ?" అన్నది గౌరమ్మ.

"నేనే, గౌరమ్మా ! గంగయ్యను," అన్నాడు దొంగ.

"ఇంత రాత్రి వచ్చావేమిటి, అన్నయ్యా ?" అంటూ గౌరమ్మ తలుపు తీసింది. ఆమె బయటఉన్న దొంగలను చూసి, చప్పున తలుపులు మూయ బోయింది. కాని ఇద్దరు దొంగలూ తలుపు తోసుకొని లోపలికి వచ్చి, గడియ పెట్టి గౌరమ్మను కట్టేశారు.

గౌరమ్మ పెట్టిన కేకకు రంగయ్య లేచాడు. దొంగలు అతన్ని కూడా బంధిం చారు. వాళ్లు గౌరమ్మ ఒంటిమీది నగ లన్నీ తీసుకుని, మరికొంత దోచుకునే టందుకు ఇల్లు సోదా చేస్తుండగా, దానయ్య లేచి వచ్చి, పరిస్థితి తెలుసు కుని, ఇంటి వాకిలి బయటినుంచి గొళ్ళెంపెట్టి, రాజభటులను లేపుకువచ్చి దొంగలను పట్టిచ్చాడు.

రాజుగారి దర్బారులో విచారణ జరిగింది. జరిగినదంతా చెప్పిన దానయ్యకు వెయ్యి రూపాయలు బహుమతి ముట్టింది. దొంగసొమ్ము దాచినందుకు రంగయ్యకూ, గౌరమ్మకూ చిన్న కారాగార శిక్ష, దొంగలకు యావజ్జీవ శిక్ష పడింది.

బహుమానం డబ్బుతో దానయ్య కొంత భూమి కొనుక్కొని, వ్యవసాయం చేసుకుంటూ కాలం గడిపాడు.



# కలల పిచ్చి

పూర్వం ఒక రాజుకు కలల పిచ్చి ఉండేది. ఆయనకు కథలు వినటంకన్న కూడా కలలు వినటం ఎంతో ఆనందంగా ఉండేది. అందుచేత, తమకు వచ్చిన విడ్డూరమైన కలలు చెప్పిన వారికి ఆయన మంచి బహుమతులు ఇస్తామని చాటింపు వేయించాడు. ఆ చాటింపు విని, దేశం మూల మూలల నుంచి వేలాదిజనం, రాజుగారికి తమ కలలు చెప్పి, చేతనైతే బహుమతులు పొందాలని రాజధానికి వచ్చిపడ్డారు. ఇలా వచ్చిన వారికి భోజన, వసతి ఏర్పాట్లు చెయ్యమని రాజు మంత్రితో చెప్పాడు.

మంత్రికి మండిపోయింది. రాజు పిచ్చివదలగొట్టటానికి ఆయన ఎక్కడినుంచో అనేక వేల గాడిదలను తెప్పించి, కలలు చెప్పేవారి బసచుట్టూ నిలబెట్టించాడు.

గాడిదలు ఎవరినీ బసనుంచి బయటికి రాకుండా అడ్డం ఉన్నాయని విని, రాజు మంత్రిని గాడిదలను గురించి అడిగాడు.

"ఏమీలేదు, మహారాజా. శ్రీముఖుడనే ధనవంతుడితో ఎవరో పాడగల గాడిదలున్నాయని చెప్పారట. పాడగలగాడిద కోసం చాటింపువేస్తే దేశం అన్నిప్రాంతాల నుంచీ వచ్చాయి. వాటిని ఎలా వదిలించుకోవాలో తెలియటం లేదు," అన్నాడు మంత్రి.

దానితో రాజుకు ఉండిన కలలపిచ్చి వదిలింది. —చెల్లూరి సీతారాజేశ్వరరావు.





# నీళ్ళ ప్రభావం

ఒక గ్రామంలో వీరయ్య అనే గజ యీతగాడు ఉండేవాడు. ఈతలో వాడి ప్రావీణ్యానికి మెచ్చి, ఎవరో జమీందారు ఇచ్చిన అద్భుతమైన కంచు విగ్రహం ఒకటి వాడి దగ్గిర ఉండేది. అది విదేశాల నుంచి వచ్చిన అరుదైన విగ్రహం. అందు చేత డబ్బు పోసినా దొరికేసరుకు కాదు.

ఒక సంవత్సరం వీరయ్య వసంతోత్సవాలు చూడటానికి రాజధానికి పోతూ, తన విగ్రహాన్ని షావుకారు కృష్ణయ్య వద్దకు తీసుకుపోయి, తాను రాజధాని నుంచి తిరిగి వచ్చేదాకా దాన్ని భద్రంగా ఉంచమని కోరాడు.

అంత అందమైన విగ్రహం వీరయ్య వంటి పేదవాడి దగ్గిర ఉండేకన్న తన వంటి సంపన్నుడి వద్ద ఉంటే బాగుంటుందనుకుని, కృష్ణయ్య దాన్ని తనకు అమ్మమన్నాడు.

''అది అమ్మేది కాదు లెండి. నేను తిరిగి వచ్చేవరకూ మీ దగ్గిర ఉంచండి, చాలు,'' అన్నాడు వీరయ్య. అతనికి సంబంధించినంత వరకు ఆ విగ్రహం తన ఈతనైపుణ్యానికి చిహ్నం!

''ఓరి, నీ కెంత పొగర్రా! నీ విగ్రహం నా దగ్గిరి కెలారాదో చూస్తాను,'' అనుకున్నాడు కృష్ణయ్య. ఆ విగ్రహాన్ని వీరయ్యకు తిరిగి ఇయ్యకూడదని అతను అప్పుడే అనుకున్నాడు. అతను ఆ విగ్రహం సహాయంతో అచ్చులు తయారుచేసి, అలాంటిదే ఒక మట్టిబొమ్మ తయారు చేయించి, దానికి ఇత్తడి పూతపూయించి, వీరయ్య తిరిగి రాగానే దాన్ని ఇచ్చేశాడు.

వీరయ్య దాన్ని ఇంటికి తీసుకుపోయి, దాని స్థానంలో ఉంచబోతూ మోసం జరిగినట్టు తెలుసుకున్నాడు. దాన్ని గూట్లో పెట్టేటప్పుడు ఓటిమోత మోగింది.

గుంటక సాంబిరెడ్డి

అదీగాక దాన్ని గట్టిగా రుద్దితే పై పూత పోయి, లోపల కుండ పెంకు బయట పడింది.

వెంటనే వీరయ్య విగ్రహాన్ని తీసుకుని కృష్ణయ్య వద్దకుపోయి, ''నా అసలు విగ్రహం దాచుకుని, ఈ మట్టి బొమ్మ ఇస్తావా? ఏం పనయ్యా? పెద్దమనిషి చెయ్యవలసిన పనేనా? డబ్బుకు దొరక లేదని దాన్ని కాజేస్తావా? నా విగ్రహం నాకు ఇచ్చెయ్యి. లేకపోతే పదిమందిలో నీ సంగతి బయటపెడతాను,'' అన్నాడు.

''నా కేమీ తెలీదు. నీ విగ్రహమే నీ కిచ్చాను. మా బావి నీళ్ళతో కడిగిన కారణం చేత నీ కంచు కాస్తా మట్టిగా మారిందేమో! నీటి ప్రభావం అలాటిది. దానికి ఎవరేం చేస్తారు?'' అన్నాడు కృష్ణయ్య.

వీరయ్య చేసేదిలేక ఊరుకున్నాడు. కాని సమయం వస్తే కృష్ణయ్యకు బుద్ధి చెప్పాలనే నిశ్చయించుకున్నాడు.

ఇలా ఉండగా ఒకరోజున షావుకారు కృష్ణయ్య భార్య ఊరి చివరన ఉన్న మంచినీటి బావిలో ఇత్తడి కడవతో నీరు తోడుతూండగా, చేదతాడు తెగి, కడవ బావిలో పడిపోయింది.

ఆ బావి చాలా లోతు. ఊరికంతకూ అది ఒకటే మంచినీటి బావి. దానిలో దిగి కడవ తీయగలవాడు వీరయ్య ఒక్కడే ఉన్నాడు. వీరయ్యను అడగటం ఇష్టం లేకపోయినా, తప్పనిసరి కావటం



చేత, మంచినీళ్ళబావి నుంచి తన ఇత్తడి కడవ తీసి పెట్టమని కృష్ణయ్య వీరయ్యను బతిమాలాడు.

''దానికేం భాగ్యం, షావుకారుగారూ? నన్ను అంతగా బతిమాలాలా? రేపు ఉదయం మీ కడవ తప్పక తీసి పెడతాను,'' అన్నాడు వీరయ్య.

ఆ రోజు అర్ధరాత్రి దాటగానే వీరయ్య ఒక మట్టి కడవ తీసుకుని బావి వద్దకు వెళ్ళి, బావిలో దిగి ఇత్తడి కడవ పైకి తీసి, దానికి కట్టి ఉన్న తాడు ముక్క తీసి మట్టి కడవకు తగిలించి, మట్టి కడవను బావిలో వదిలి, ఇత్తడి కడవను ఒక రహస్య ప్రదేశంలో దాచి, ఇంటికి వెళ్ళి పడుకుని నిద్రపోయాడు.

మర్నాడు ఉదయం షావుకారు చూస్తూండగానే వీరయ్య బావిలోకి దిగి, నీటిలో మునిగి, మట్టి కడవ పైకి తెచ్చాడు. అది చూసి షావుకారు తెల్లబోయి, ''అది మన గ్రామంవాళ్ళదే, ఇంకెవరిదో అయి ఉంటుంది. ఇంకొక్కసారి మునిగి చూడు, వీరయ్యా,'' అని బతిమాలాడు.

వీరయ్య మునిగి, చాలా సేపటికి పైకి వచ్చి, ''బావిలో ఈ మట్టి కడవ తప్ప ఇంకో కడవ లేదు, షావుకారుగారూ. నీటి ప్రభావం వల్ల మీ ఇత్తడి కడవ మట్టి కడవ అయిందేమో! నీళ్ళ ప్రభావం మీకూ తెలుసుగదా,'' అని ఇంటికి వెళ్ళిపోయాడు.

అయినా ఆశతీరక కృష్ణయ్య డబ్బిచ్చి ఇద్దరు మనుషులను పెట్టి, బావిలో నీరంతా తోడించాడు. బావిలో కుండ పెంకులు తప్ప మరేమీ కనిపించలేదు. ఆ రోజు మంచి నీరులేకుండా చేసినందుకు గ్రామస్థులందరూ కృష్ణయ్యను నానామాటలూ అన్నారు.

ఆ రాత్రి రహస్యంగా కృష్ణయ్య వీరయ్య ఇంటికి వెళ్ళి, తాను మోసం చేశానని ఒప్పుకుని చెంపలు వాయించుకుని, వీరయ్య విగ్రహం వీరయ్య కిచ్చి, తన ఇత్తడికడవ తాను తెచ్చుకున్నాడు.



# కనువిప్పు

అవంతి రాజైన సువర్ణసేనుడి సామంతుడు వీరపాలుడు తాను స్వతంత్ర రాజునని ప్రకటించుకుని కప్పం చెల్లించ నిరాకరించాడు. వీరపాలుడి మీద యుద్ధం ప్రకటించి, యుద్ధసన్నాహాలు చేయమని సువర్ణసేనుడు మంత్రితో అన్నాడు.

"అవంతిలో ప్రస్తుతం అరాజకంగా ఉన్నది. కాకపోయినా ఇది వర్షాకాలం, అందుచేత యుద్ధానికి తరుణం కాదు. కొద్దికాలం ఆగండి," అన్నాడు మంత్రి. కాని రాజు అందుకు ఒప్పుకోలేదు.

యువరాజు సుబుద్ధి ఈ సంభాషణవిని, తండ్రికి కనువిప్పు కలిగించాలనుకుని, ఆ సాయంకాలం తండ్రి వాహ్యాళికి తోటకు వచ్చే సమయానికి, మామిడిచెట్టుకు కడవలకొద్దీ నీళ్ళుపోయిస్తూ కనిపించాడు.

రాజు అది చూసి, "అనలే వర్షాకాలం కదా, ఆ మామిడిచెట్టుకు అలా నీరు పోయిస్తున్నావేమిటి?" అని కొడుకును అడిగాడు.

"నాకు త్వరగా మామిడిపళ్ళు కావాలి," అన్నాడు సుబుద్ధి.

"దానికిది తరుణం కాదు గదా?" అన్నాడు రాజు.

"యుద్ధానికి లేని తరుణం మామిడిపళ్ళకు వచ్చిందా?" అన్నాడు సుబుద్ధి.

రాజు యుద్ధప్రయత్నం మానుకున్నాడు.

—ఎం.డి. అబ్దుల్లా.






# అత్తవారింట్లో అల్లుడు

ఒక గ్రామంలో చిన్నమ్మ అనే ఆమెకు చిన్నయ్య అనే కొడుకు ఉండేవాడు. ఆమె వాడికి చిట్టెమ్మ నిచ్చి పెళ్లి చేసింది. చిన్నయ్యకు మొదటి నుంచీ పెళ్లాం మీద అమితమైన మోజు ఏర్పడింది. అయినా వ్యవసాయం చేసుకుంటూ తల్లినీ, ఇంటినీ కనిపెట్టుకుని ఉండేవాడు చిన్నయ్య.

ఒకసారి పుట్టింట ఏదో అక్కర అయితే చిట్టెమ్మ వెళ్ళింది. భార్యను విడిచి ఒక్క రోజు కూడా ఉండలేని చిన్నయ్య అక్కర తీరగానే భార్యను తీసుకు రావటానికి, మర్నాడే తాను కూడా అత్తవారింటికి వెళ్ళాడు.

అల్లుడికి అత్తవారింట్లో అందరూ బ్రహ్మరథం పట్టి, అడుగడుగునా ఆదరం చూపారు. చిన్నయ్య తాను వచ్చినపని మరిచిపోయి, స్వర్గంలో ఉన్నాననుకున్నాడు. చిట్టెమ్మ పుట్టింట అక్కర ముగిసిన మర్నాటి నుంచీ భర్త తనను ప్రయాణం కమ్మంటాడని అనుకున్నది గాని, చిన్నయ్య అలాటి ప్రయత్నం ఏమీ చెయ్యకపోయేసరికి, పుట్టింట మరి కొంత కాలం ఉండటం ఏ ఆడపిల్లకైనా సంతోషమే గనక, మాట్లాడక ఊరుకున్నది.

నెలరోజులు గడిచినా చిన్నయ్య కదిలే ధోరణిలో లేడు. క్రమంగా అతని మామ గారిలోనూ, బావమరదుల్లోనూ మార్పు వచ్చింది. వాళ్లు చేతికి నీళ్ళు ఇయ్యటం మానేసి, నూతిని చూపించారు. ఇలాటి మార్పులను చిన్నయ్య గమనించలేదు; గమనించినా పట్టించుకోలేదు.

ఒకరోజు మామగారు పొలం పోతూ చిన్నయ్యను తమ పొలం చూడరమ్మని, పిలుచుకుపోయాడు. అక్కడ ధాన్యం కొలుస్తున్నారు. ధాన్యం కొలిచే చోట పెద్ద

బావమరిది ఉన్నాడు. అతను తనను చూసి చిరునవ్వు అయినా నవ్వనందుకు చిన్నయ్య చిన్నబోయాడు. బావమరిది ధాన్యం లెక్కలు తండ్రికి అప్పగించి, ఇంటికి పోతున్నానని చెప్పి, వెళ్ళి పోయాడు.

కొద్దిసేపయిన తరవాత మామగారు, ''ఇప్పుడే వస్తాను,'' అని చెప్పి ఎటో వెళ్ళాడు. బాధ్యత తన మీద పడేసరికి చిన్నయ్య ధాన్యాన్ని కాటా వేయించి, బండికెక్కించి, ఇంటికి తెచ్చాడు.

''అయ్యో, ఎంతపని జరిగింది! ధ్యానం ఇంటికి తేవటానికి కాదు, పట్నంలో అమ్మటానికి,'' అని మామగారు అనేసరికి, చేసేదిలేక, చిన్నయ్య పట్నం వెళ్ళి, ధాన్యం మంచి ధరకే అమ్మి, మూడు రోజులకు ఇంటికి తిరిగి వచ్చాడు. ఆ మూడు రోజులూ శ్రమ జాస్తి అయి, భోజనం సరిగా లేక, శరీరమంతా నలగగొట్టినట్టు ఉండటంచేత చిన్నయ్య వేడి నీళ్ళు పోసుకుని, భోజనంచేసి, సుఖంగా పడుకుందామని ఆశపడ్డాడు.

కాని, ఇంటికి వచ్చేసరికి తలుపు తాళం పెట్టి ఉన్నది. పక్కింటి కామమ్మను అడిగితే, చిట్టెమ్మతో సహా అందరూ పొరుగూరు వెళ్ళారనీ, అక్కడ ఏదో వీధి నాటకం ఉన్నదనీ చెప్పింది. చేసేదిలేక చిన్నయ్య తెల్లవార్లూ, చలి గాలిలో బాధపడుతూ, వీధి అరుగుమీదనే పడుకున్నాడు.



తెల్లవారుతూనే పొరుగూరు నుంచి బండిలో అందరూ తిరిగి వచ్చారు. వారి వెంట చిట్టెమ్మ అక్క, బావా కూడా వచ్చారు. అయితే వచ్చినవాళ్ళు చిన్నయ్యను పలకరించనైనా లేదు; అతని తోడి అల్లుడికి మర్యాదలన్నీ జరుగుతున్నాయి. ఇది చూసి, అసలే రాత్రంతా నిద్రలేకుండా అవస్థపడిన చిన్నయ్యకు కోపం వచ్చింది.

చిన్నయ్య స్నానం చేద్దామని వేడి నీళ్లు తోడుకుంటూంటే, చిన్న బావమరిది రుసరుసలాడుతూ అక్కడికి వచ్చి, వేడి నీళ్ళు కాచినది చిన్నయ్య తోడి అల్లుడికని కోపంగా చెప్పాడు.

భోజనాల దగ్గిర కూడా చిన్నయ్యకు పచ్చడి మెతుకులూ, అతని తోడి అల్లుడికి పిండివంటలూ లభించాయి. చిన్నయ్యకు వళ్ళు మండిపోయింది. అతను గదిలోకి విసురుగా వచ్చి చిట్టెమ్మతో, "అయనేనా అల్లుడు? నేను కానా? మీవాళ్ళు నన్ను ఇంత అవమానం చేస్తూంటే నువు చూస్తూ ఊరుకుంటావా?" అని నాలుగూ దులిపేశాడు.

చిట్టెమ్మ నిదానంగా అతనితో, "మీరు వచ్చినప్పుడు, నన్ను తీసుకుపోవటానికి వచ్చారని మా వాళ్లు అనుకున్నారు గాని, వాళ్ళుచేసే మర్యాదలకు మురిసి ఇల్లరికం ఉండిపోతారని అనుకోలేదు. మూడు రోజులుండే అల్లుడికి ముచ్చట్లూ, అచ్చట్లూ గాని నెలల తరబడి ఎవరు మర్యాదలు జరపగలరు? మీరు నన్ను ఏలుకుంటారని నన్నిచ్చి పెళ్ళి చేశారు గాని, మిమ్మల్నీ, నన్నూ ఏలటానికి కాదుగదా! మీ బావమరదులు మిమ్మల్ని ఎలా చూస్తున్నారో, మా వదినెలు నన్ను అలాగే చూస్తున్నారు. నే నెవరితో చెప్పకోను? చేయించుకున్న మర్యాదలు చాలు, మనింటికి మనం పోదాంపదండి," అన్నది.

చిన్నయ్య పొరపాటు తనదేనని తెలుసుకుని, భార్యతో సహా ఇంటికి ప్రయాణమైనాడు.





# వీణా హనుమాన్

రామనామ జపంతో హనుమంతుడు గంధ మాదన పర్వతం మీద తపస్సు చేస్తూండగా బ్రహ్మ వచ్చి, "హనుమా! కలియుగం ప్రవేశించ బోతున్నది. కలి నీకు సరి పడదు. ఈ యుగాలకు అతీతంగా ఉండే క్షీరసాగరానికి వెళ్లు!" అని హెచ్చరించి వెళ్ళాడు.

క్షీరసాగరంలో శేషపానుపుపై పవ ళించి ఉండే విష్ణువు దగ్గిర తుంబుర, నారదులు సదా సంగీతం వినిపిస్తూ ఉంటారు. నారదుడు మహతివీణ మీటుతూ గొప్ప భక్తి భావాలుగల కీర్తనలు పాడుతుంటాడు. తుంబురుడు, అతడిపై పోటీపడుతూ, హయగ్రీవ వీణపై మృదంగ ధ్వనులు కూడా తెప్పిస్తూ కట్టుదిట్టమైన శాస్త్రీయగానం తాళ ప్రధానంగా వినిపిస్తూంటాడు.

వారిద్దరూ, ఎవరికి వారు తానే గొప్ప సంగీత వేత్తననే గర్వంతో అసూయా ద్వేషాలు ప్రబలంగా పెంచుకుంటూ వచ్చారు.

చీటికి మాటికి పోటీపడుతూ సంగీతం కట్టి పెట్టి, దూషణ ఛీత్కారాలతో వీణలను గదాయుధాల్లాగ ఎత్తి కొట్లాడు కోవడమేగాకుండా, "మాలో ఎవరు గొప్ప? మీరు చెప్పి తీరాలి," అని విష్ణువునే వేధించసాగారు.

విష్ణువు వాళ్ళను సుముదాయించలేక యోగనిద్రలోకి జారుకున్నప్పటికీ, ఇద్దరూ చెరో చెవి దగ్గిరా నోళ్లుపెట్టి పాడి, "మాలో



ఎవరు గొప్పవాడో చెప్తావా చెప్పవా? చెప్పేవరకూ, వదిలేది లేదు.'' అని మరింత వేధిస్తూ వచ్చారు.

విష్ణువు విసిగిపోయి, ''మీ సంగీతంతో నేను పరవశించిపోయి యోగనిద్రలో పడుతూ, లేస్తూ ఉంటాను; కనక నేను సరిగ్గా చెప్పలేను. గంధమాదన పర్వతం మీద ఒక కోతి ఉన్నది. రాముడు పిలుస్తున్నాడని చెప్పి, ఆ కోతిని యిక్కడకు తీసుకురండి. అతను మీ గొప్పలు సరిగ్గా గుర్తించి చెప్పగలడు!'' అని వాళ్ళను పంపించాడు.

తుంబుర నారదులు విస్తుబోయి, ఒకర్నొకరు కొరకొరా చూసుకొంటూ, గంధమాదన పర్వత ప్రాంతం చేరుకుంటూండే సరికి హనుమంతుడు ఏకధారగా చేస్తూన్న రామనామ జపం ఓంకారనాదంగా వినిపించింది. తుంబుర నారదులు పర్వతం మీదకు వెళ్లి, హనుమంతుడి సమీపంలో నిల్చున్నారు. హనుమంతుడు కళ్ళు మూసి, రామనామాన్ని స్థాయి హెచ్చిస్తూ, తగ్గిస్తూ స్వరయుక్తంగా గానం చేస్తూన్నట్లు జపిస్తున్నాడు. ఆ జపంలో అనేక రాగాలు వినిపిస్తూన్నవి. ఆ రాగాలసమ్మేళనంలో అనేక భావాలు కలుగుతూన్నవి.

రా - మ అనే రెండు అక్షరాలే అనేక తాళగతులతో లయవిన్యాసం చేస్తున్నాయి. తుంబుర నారదులు ఆ అపూర్వగానానికి ఆశ్చర్యపోయారు. వచ్చిన పని మరిచారు. హనుమంతుడు గొప్ప నాదోపాసకుడని గ్రహించారు. సాహిత్యం కంటే, శాస్త్రం కంటే గాత్రమాధుర్యం ఎంత గొప్పదో తెలుసుకున్నారు. వాళ్లుకూడా పరవశించి హనుమంతుడితో కలిసి రామ జపం చేశారు. హనుమంతుడి గంభీర మంద్ర గాత్రంతో, వాళ్ళ గొంతులు కలవక, అపశృతి కలిగి హనుమంతుడు కళ్ళు తెరిచాడు. ఒళ్ళు మరిచి కళ్ళుమూసి రామస్మరణ చేస్తున్న తుంబురనారదులు అతడికి కనిపించారు. హనుమంతుడు

దిగ్గునలేచి వారి పాదాలు పట్టి కళ్ళకు అద్దుకున్నాడు.

తుంబుర నారదులు తెప్పరిల్లి కాళ్లు వెనక్కు లాక్కుని, ''మహానుభావా! మా కాళ్ళు నువ్వు పట్టుకోవడమేమిటి? మేం ఎవరి మనుకున్నావో, తుంబుర నారదులం!'' అన్నారు.

''మీ రెవరైనా కావచ్చు. రామనామ స్మరణ చేస్తున్నవారంతా నాకు ఆరాధ్యులు, వారి పాదధూళి నా శిరస్సున చల్లుకుంటాను, అది నాకు తృప్తి, ఆనందము, భాగ్యమూను!'' అని హనుమంతుడు అన్నాడు.

హనుమంతుడు ఎంత గొప్ప గానకళా కోవిదుడో, భక్తి తత్పరుడో గ్రహించి, తుంబుర నారదులు ఆశ్చర్యపోతూ, ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. తరవాత తాము వచ్చిన పని గుర్తుతెచ్చుకొని, "హనుమంతుడా! రాముడు నిన్ను తీసుకు రమ్మని మమ్మల్ని యీ గంధమాదన పర్వతానికి పంపాడు. ఆయన క్షీరసాగరంలో శేష తల్పం మీద ఉన్నాడు,'' అని తుంబురుడు అన్నాడు.

''సీత అతని పాదాలు ఒత్తుతూన్నది, లక్ష్మణుడు వేయిపడగల గొడుగు పడుతున్నాడు. భరత శత్రుఘ్నులు అతని భుజాల్ని అంటిపెట్టుకుని ఉన్నారు!'' అని నారదుడు చెప్పాడు.

హనుమంతుడు వారి వెంట క్షీరసాగరం చేరుకున్నాడు. గరుత్మంతుడు ఎదురు





వచ్చి స్వాగతం చెప్పి, ఆనందంతో హను మంతుడి భుజాల మీద చేతులువేసి, యోగక్షేమాలడుగుతూ, అతణ్ణి విష్ణువు దగ్గిరికి తీసుకెళ్ళాడు.

హనుమంతుడికి విష్ణువు రాముడిలాగే కనిపించాడు. విష్ణువే రాముడు. రాముడు విష్ణువు అవతారం అని గుర్తు తెచ్చుకుని హనుమంతుడు వంగి చేతులు జోడించాడు.

విష్ణువు హనుమంతుడితో, "హను మంతుడా! తుంబుర నారదులు పోటీ పడుతున్నారు. నువ్వు వాళ్ళ పాండిత్యం పరీక్షించి తేలుస్తావని నిన్ను తీసుకు రమ్మన్నాను. వారిని పరీక్షించే ముందు కాస్త నీ గానాన్ని మాకు వినిపించు!" అన్నాడు.

హనుమంతుడు, "రామ రామ, నేను సంగీతవేత్తను కాను సరిగదా సరిగమలు కూడా తెలియని కపిని, వాయుపుత్రుణ్ణి. నాది కేవలం గాలిపాట. మహామహుల ముందు పాడేపాటి శక్తిమంతుణ్ణికాదు," అన్నాడు.

"హనుమా! ఎప్పుడూ నీతో వచ్చిన చిక్కు ఇదే. నీ శక్తి నీకు తెలియదు. నువ్వు సూర్యుడి దగ్గిర అన్ని శాస్త్రాలూ, కళలూ, నవ వ్యాకరణాలూ క్షుణ్ణంగా నేర్చినవాడివి. ఎవరో ఒకరు నీ సత్తువ నీకు చెప్పేదాకా, నీకు ఆవేశం రాదు. నే చెబుతున్నాగదా, ఇహ పాడు!" అన్నాడు విష్ణువు.

అప్పుడు హనుమంతుడు తన పేరు మొదటి 'హ' కారంతో హ అంటూ మంద్రగంభీర నాదంతో ప్రారంభించి విష్ణువుకు ప్రియమైన హిందోళరాగాన్ని ఆలాపన అందుకున్నాడు. తుంబుర నారదులు ఆ స్వరమాధుర్యానికీ, గాత్ర గాంభీర్యానికీ సంభ్రమాశ్చర్యాలుచెంది, నోళ్ళు తెరుచుకొని, చెవులు రిక్కించి వింటున్నారు.

హనుమంతుడు హిందోళ రాగాన్ని వైజయంతిగా మల్లిస్తూ రామనామాన్ని

అందుకున్నాడు. రామ అనే రెండక్షరాలతోనే స్థాయి భేదాలతో, ఎన్నెన్నో తాళగతులతో అనేక రాగాలతో హనుమంతుడు పాడుతూంటే పాలసముద్రం కెరటాలు నాట్యం చేశాయి, వింటున్నవారి గుండెల్లో ఆనంద తరంగాలు పెల్లుబికాయి. తుంబుర నారదులకు ఎన్నడూ అనుభూతికి రాని భక్తి భావాలు స్ఫురించాయి. హనుమంతుడు తారస్థాయికి చేరుకున్నాడు. పాలసముద్రం కెరటాలు ఉవ్వెత్తుగా లేచి నక్షత్రాల్ని కప్పేశాయి. శేషుడి వెయ్యి పడగలు అల్లల్లాడాయి. హనుమంతుడు ఒక్కసారిగా మంద్రస్థాయికి దిగి, దేవగాంధార రాగాన్ని అందుకున్నాడు. శాంతరసప్రధానమైన ఆ రాగానికి పాలసముద్రం క్రమక్రమంగా పేరుకొని గడ్డకట్టుకుంది. తుంబుర నారదుల హయగ్రీవ, మహతి వీణలు జున్ను ముక్కల్లో పుడకల్లాగ అందులో ఉండిపోయాయి. క్షీరసాగరం మరింత గట్టిపడి పాలరాతిలాగ తయారైంది. శేషుడు అందులో నొక్కుకుపోయి ఇబ్బందిపడ్డాడు.



విష్ణువు హనుమంతుడిని ఆగమని సంజ్ఞ చేశాడు. హఠాత్తుగా ఆగిపోయిన గానంతో తుంబుర నారదులు ఉలిక్కిపడి, పాలరాతి మంచుబండలా ఉన్న సముద్రంలో ఉండిపోయిన తమ వీణలను చూశారు.

"మీరు పాడి సముద్రాన్ని కరిగించి వీణలు తీసుకోండి!" అని విష్ణువు ఆజ్ఞాపించాడు.

నారదుడి భక్తి సాహిత్యం వల్లగాని, తుంబురుడి పడికట్టురాళ్ళ సంగీతశాస్త్రం వల్లగాని పాలరాతి బండ కొంచెమైనా మెత్తబడలేదు. తుంబుర నారదులు లోగడ పడ్డ గర్వానికి సిగ్గుపడి తలలు దించుకున్నారు.

విష్ణువు ఆదేశం ప్రకారం హనుమంతుడు భూపాల, వసంత, జంఝూటి, దీపక మొదలైన రాగాలతో రామనామ



గానం చేశాడు. అప్పుడు రాగరాగిణులు రూపుదాల్చి నృత్యం చేశారు. హనుమంతుని గానం తారస్థాయికి చేరుకొని ప్రళయ ప్రకంపనం చేసింది. కైలాసం నుండి శివుడు ఢమరుకం వాయిస్తూ తాండవం చేస్తూ వచ్చాడు. అతని వెనుక పార్వతి, గణపతి, ప్రమథగణాలు వచ్చారు. బ్రహ్మ పద్మాసనం దిగి వచ్చాడు. అతనితో సరస్వతి వీణ వాయిస్తూ వచ్చింది. ఇంద్రాది దేవతలు వచ్చారు. పాల సముద్రం కెరటాలతో ఉయ్యాలలూగింది. అప్పుడు క్షీరసాగరం ఒక పెద్ద కళ్యాణమంటపంలాగ కళకళ లాడింది. నవ వధూవరుల్లాగ లక్ష్మి నారాయణులు కనిపించారు. సీతారాముల కళ్యాణం ఇలాగే జరిగి ఉంటుందని హనుమంతుడు ఆనంద తన్మయత్వంలో మునిగిపోయాడు. తుంబుర నారదులు వీణలు తీసుకున్నారు. శేషుడు పక్క సర్దుకున్నాడు.

అప్పుడు, "హనుమంతుడు పాడిన రీతి, హనుమద్గానం అని పేరొంది చిరకాలం వర్ధిల్లుతుంది. పండిత పామరులను సమానంగా ఆకర్షించి హృదయాన్ని ఆకట్టుకుంటుంది; అదే కళకు పరమావధి. నారదుడి సంగీతం భావప్రధానమైనది. తుంబురుడి సంగీతం తాళప్రధానమైనది. భావాన్ని తాళాన్ని సమన్వయపరిచేది రాగం. భావరాగతాళాలు మూడూ సమానమే అయినా, రాగం జీవం లాంటిది, రసాత్మకమైనది, మనస్సు మీద దాని ప్రభావం హెచ్చు. హనుమద్గానం రాగప్రధానమైనది కావటం వల్ల అది ఎప్పటికీ జనరంజకంగా ఉంటుంది!" అని సరస్వతీదేవి తీర్పు చెప్పింది.

బ్రహ్మ ముందుకు వచ్చి, "హనుమంతుడా! నువ్వు ఏ కోరికా లేకుండా చేసినప్పటికీ, నీ తపస్సుకి విలువకట్టగా బ్రహ్మపదవి కూడా చాలింది కాదు; కాని అంతకు మించింది లేదు. నువ్వు కాబోయే బ్రహ్మవు! రామనామ జపంతో నీవు చేసిన

తపస్సే నీవా పదవిని నిర్వహించక తప్పేది లేదని రాసిపెట్టింది. రానున్న కల్పంలో నీ వలన సృష్టి జరుగుతుంది!'' అని చెప్పాడు.

అప్పుడు శివుడు ముందుకు వచ్చి, ''హనుమా! ఈ బ్రహ్మదేవుడి సృష్టిలో మంచివాళ్ళకంటే చెడ్డవాళ్ళే హెచ్చుగా పుట్టారు, పుడుతున్నారు, పుడతారు! తాను దేవుడిననే అహంకారం వల్ల, పరిపూర్ణ మానవత్వం మీద గురిలేకపోవడం వల్ల ఇలా జరిగింది. నీవు కోతివైనా, నీ ధ్యానంలో రాముడు ఉన్నందువల్ల నీ సృష్టిలో రాముడి వంటి పరిపూర్ణ మానవులు, సీత వంటి మానినులు, లక్ష్మణుని వంటి సోదరులు నిండుగా ఉంటారు! అంతవరకూ నీవు విష్ణు సాన్నిధ్యంలో ఉండు!'' అని చెప్పాడు.

అప్పుడు బ్రహ్మ, ''ఔను, హనుమా! శివుడు సరిగ్గా చెప్పాడు. ఎక్కువమంది మంచివారి మధ్య కొద్దిమంది దారి తప్పిన వారున్నా వారిని దారికి తీసుకువచ్చే అవకాశం బాగా ఉంటుంది. అది నీ సృష్టిలో జరిగి తీరుతుంది! రాబోతూన్న బ్రహ్మకల్పంలో విష్ణువు బొడ్డు నుంచి సరికొత్త బ్రహ్మకమలం విచ్చుకుంటుంది. ఆ పద్మాసనాన్ని బ్రహ్మగా నీవు అలంకరిస్తావు. నీవు భవిష్యత్ బ్రహ్మదేవుడివి! సృష్టికర్తవు!'' అని బ్రహ్మవాక్కుగా చెప్పాడు.

అందరూ హనుమంతుడిని మంగళ గానం వినిపించమని కోరారు. హనుమంతుడు, ''పవమానసుతుడు బట్టు పాదారవిందములకు, నిత్య జయ మంగళం!'' అని శ్రీరాగంలో మంగళ గానం చేశాడు.

హనుమంతుడు నారద తుంబుర గరుత్మంతులతో క్షీరసాగరంలో శేషతల్ప శాయియైన విష్ణువు సన్నిధానంలో లక్ష్మీ నారాయణులను సీతారాములుగా సేవిస్తూ ఉంటున్నాడు. హనుమంతుడు చిరంజీవి; అతడు కాబోయే బ్రహ్మ!

—(అయిపోయింది)





# ఉదంకుడి కథ

ఉదంకుడు పైలుడి శిష్యుడు. గురుదక్షిణ కింద తనకు పౌష్యుడి భార్య ధరించే కుండలాలు తెమ్మని పైలుడి భార్య ఉదంకుణ్ణి కోరింది.



ఉదంకుడు పౌష్యుడి భార్యను ఒప్పించి, ఆమె కుండలాలు తీసుకున్నాడు. అయితే, తక్షకుడు వాటిని అపహరించవచ్చుననీ, జాగ్రత్తగా ఉండమనీ పౌష్యుడి భార్య హెచ్చరించింది.



అలాగే జరిగింది కూడా. ఉదంకుడు తన గురువు ఆశ్రమానికి తిరిగి వస్తూ, దారిలో ఒక కొలను గట్టున కుండలాలు పెట్టి, స్నానం చేస్తూంటే, తక్షకుడు మనిషిరూపంలో వచ్చి ఆ కుండలాలు హరించాడు. ఉదంకుడు అతన్ని వెంబడించాడు.



ఉదంకుడు తనను పట్టుకునే సమయానికి తక్షకుడు పామురూపం ధరించి, ఒక బిలంలోకి దూరిపోయాడు.

ఉదంకుడు ఒక కర్రతో ఆ బిలాన్ని తవ్వుకుంటూ నాగలోకానికి పోవాలని చూశాడు, కాని అది సాధ్యంఅయే పని కాదు.





అందుచేత అతను ఇంద్రుణ్ణి ప్రార్థించాడు. ఇంద్రుడు తన వజ్రాయుధంతో నాగలోకానికి మార్గం చేశాడు.

పాతాళంలో ఉదంకుడు అనేక వింతలు చూశాడు. ఇద్దరు స్త్రీలు తెలుపు, నలుపు రంగుల పోగులతో ఒక బట్టనేస్తున్నారు. ఆ పోగులు పగళ్ళూ, రాత్రులూనూ.





మరొక చోట ఆరుగురు మనుషులు పన్నెండు ఆకులుగల చక్రాన్ని తిప్పుతున్నారు. ఆ మనుషులు ఆరు ఋతువులు. చక్రం ఆకులు పన్నెండు మాసాలు.

ఉదంకుడికి సమీపంలో ఒక దివ్య పురుషుడు గుర్రం ఎక్కి కనిపించాడు. ఆ దివ్యపురుషుడు ఇంద్రుడే. ఉదంకుడు ఆ పురుషుణ్ణి, తన కుండలాలు తన కిప్పించమని ప్రార్థించాడు.





దివ్యపురుషుడి ప్రేరణతో గుర్రం ముక్కుల నుండీ, నోటి నుండీ అగ్ని జ్వాలలు వెలువడి, నాగలోకాన్ని సంక్షోభింపజేశాయి.



నాగులకు ప్రాణభయం ఏర్పడటం చూసి, నాగరాజైన తక్షకుడు ఉదంకుడికి కుండలాలు తిరిగి ఇచ్చేశాడు.



ఉదంకుడు దివ్యపురుషుడి గుర్రాన్నే ఎక్కి గురు భార్యకు కుండలాలు ఇచ్చాడు. ఆమె వ్రతం పూర్తి చేసేలోగా కుండలాలు రావని భయపడిందిగాని, ఉదంకుడు తనమాట నిలుపుకున్నాడు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

?

ఒక మహారాజు వద్దకు ఇద్దరు చిత్రకారులు వచ్చి, ఆయన మందహాసం చేస్తున్నట్టుగా చెరొక చిత్రరువూ రచించి, రాజుగారికి సమర్పించారు.

తూర్పు నుంచి వచ్చిన చిత్రకారుడి చిత్తరువులో రాజుగారి ముఖాన మామూలుగా ఉండేకన్న ముడతలు ఎక్కువగా ఉండటమేగాక, ఆయన నవ్వుతుంటే ఏడుస్తున్నట్టుగా కనబడింది.

పడమటి చిత్రకారుడి చిత్తరువులో రాజుగారి ముఖం మామూలుగా ఉన్నట్టే ఉన్నది. పై పెచ్చు నవ్వుతున్న రాజుగారి ముఖం మరింత అందంగా ఉన్నట్టు కూడా కనబడింది.

రాజుగారు పడమటి చిత్రకారుడికి గొప్ప బహుమానం ఇచ్చి, తూర్పు చిత్రకారుడికి ఏమీ ఇయ్యలేదు. తరవాత ఆయన పడమటి చిత్రకారుడి చిత్తరువును తదేకంగా చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

వెంటనే ఆయన ముఖం నిండా ముడతలు ఏర్పడటమేగాక, ఆ నవ్వు ఏడుస్తున్నట్టుగా తూర్పు చిత్రకారుడు చిత్రించినట్టే ఉన్నది.

—వీరేపల్లి జయరాంరెడ్డి

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలింపబడవు.

కార్డులు మాకు సెప్టెంబరు 20 లోగా చేరాలి. అందులో ఫోటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, నవంబరు నెల చందమామలో ప్రకటించబడును.

---

జూలై నెల పోటీ ఫలితం: నారాయణ!

గెలుపొందిన వారి పేరు: పి. వెంకటేశ్వర్లు, మెయిన్‌బజార్, విజయవాడ-1

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







M. Natarajan

Nirmal Kumar Tak

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ సెప్టెంబరు నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : జైలుకెళ్ళిన దొంగ

రెండవ ఫోటో : జీతంలేని గూర్ఖా

పంపినవారు : జి. పినాకపాణి, వి. వి. అగ్రహారం, నెల్లూరు-1

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

# లాలించాలి, లాలిస్తే పిల్లల్నేమో ఏపుగా పెరుగుతారు




ప్రీతితో యిచ్చేది

## పార్లే గ్లూకో మజా రుచితో ఎంతో శక్తితో

పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్ మజా రుచులతో నిండి, పుష్టి నిచ్చే లక్షణాలు గలది.



గ్లూకో

భారతదేశంలో అత్యధికంగా అమ్ముబడే బిస్కట్—
వరల్డ్ ఎవార్డ్ విజేత

